# కిన్నెర

## మే 1953

### వి ష య సూ చి క





ఎడిటర్ పందిరి మల్లికార్జునరావు

అసిస్టెంట్ ఎడిటర్ పందిరి మీరాబాయి

సంపుటము 5 | మే 1953 | సంచిక 7


# ఆంధ్ర - మైసూరు సరిహద్దులు

మార్చి నెల 25 తేదీని ప్రధాని నెహ్రూ ఆంధ్ర రాష్ట్రనిర్మాణ ప్రకటనను అనుసరించి పదకొండు జిల్లాలు, బళ్ళారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాలు చేరి, నిర్వివాదప్రాంతంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడగలదని ప్రకటించారు బళ్ళారి జిల్లాలోని ఆరు తాలూకాలను కన్నడ తాలూకాలుగా భావించి, వానిని మైసూరులో చేర్చుటకు తీర్మానించారు బళ్ళారి జిల్లాలోని పది తాలూకాలో ఆరు తాలూకాలు కన్నడప్రాంతము, మూడు తాలూకాలు తెలుగు ప్రాంతమని నిర్ణయం జరిగింది ఇక మిగిలిన బళ్ళారి తాలూకానుగూర్చిన నిర్ణయం వాయిదా వేయబడినది

ఇది ఆదనుగా తీసికొని బళ్ళారి తాలూకాయే కాకుండా, బళ్ళారి జిల్లా అంతా కన్నడప్రాంతంలోనే చేర్చవలెనని కన్నడిగులు తీవ్రమైన ఆందోళన చేస్తున్నారు ముఖ్యంగా బళ్ళారి తాలూకా యావత్తూ కన్నడప్రాంతమే అనీ, కావున, దానిని మైసూరు ప్రాంతంలో చేర్చాలనీ వాదిస్తున్నారు

ఇందుకు ఫలితంగా ఆ తాలూకానుగూర్చిన నిర్ణయాన్ని చేయడానికి ఒక సరిహద్దు కమీషనును కేంద్రప్రభుత్వం ఏర్పాటుచేయనున్నది హైకోర్టు జడ్జీని ఒకరిని సరిహద్దు కమీషను ప్రతిపత్తితో ఏర్పాటుచేయగలదట

కానైతే, ఈ న్యాయాధిపతి బళ్ళారి తాలూకాను గూర్చిన విచారణయేకాక, ఆంధ్రరాష్ట్రంలో చేరడానికి నిర్వివాదప్రాంతాలుగా అంగీకరింపబడిన ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాలనుగూర్చికూడ పునర్విమర్శ చేయగలరట ఇది ఏవిధంగా నడచో ఎట్లు న్యాయసమ్మతమైనదో ఊహింప వీలులేకున్నది

బళ్ళారి తాలూకానుగూర్చిన విచారణ సందర్భంలో ఈ మూడు తాలూకాల పునర్విమర్శన అవసరమని తలుపబడినప్పుడు, బళ్ళారి జిల్లాలోని పది తాలూకాలనుగూర్చి కూడ పునర్విమర్శింపవలసి ఉంటుంది అట్లుకాక, తెలుగు ప్రాంతాలయిన మూడు తాలూకాలనుగూర్చి పునరాలోచించు ప్రయత్నం ఎంతమాత్రం సమంజసం కాదు

కిన్నెర

కేల్కారు నిర్ణయంప్రకారం తెలుగు ప్రాంతంగా అంగీకరింపబడిన ఈ తాలూకాలలోని కొన్ని గ్రామాలు తదనంతరం శిరుగుప్ప తాలూకాలో చేర్చబడినవి వానినికూడ తెలుగు ప్రాంతంలోనే చేర్చవలెను అట్లాగే బళ్ళారి తాలూకా కూడ ఆంధ్రప్రాంతంలోనే చేరవలెనుకాని, కన్నడ ప్రాంతంలో చేర్చుటకు ఎంతమాత్రం అవకాశంలేదు బళ్ళారికి తూర్పునఉన్న బళ్ళారి, రూపనగుడి మోక ఫిర్కాలు ప్రధానంగా తెలుగు ఫిర్కాలు బళ్ళారి పట్టణం ఆంధ్రదేశానికి దూరంగాలేక అనుస్యూతంగానే ఉన్నది బళ్ళారి పట్టణం ఆంధ్రదేశానికి అనుస్యూతంగా లేదను వాదం కేవలం సత్యదూరమైనది ఇది వాస్తవిక విషయాలను తప్పుబుచ్చ చేయుటకు ఉద్దేశింపబడిన పాటుమాత్రమే కావున, యథార్థపరిస్థితులదృష్ట్యా కేల్కారు నిర్ణయంప్రకారం తెలుగు ప్రాంతంలో చేరవలసిన మూడు తాలూకాలను బళ్ళారి పట్టణంతోసహా బళ్ళారి తాలూకాను ఆంధ్రరాష్ట్రంలో చేర్చడం సబబు ఇందుకు భిన్నంగా జరిగితే, ఆంధ్రులకు ఇదివరకు జరిగిన అన్యాయాలకుతోడు మరియొకటికూడ జరుగగలదు

ఈ సందర్భంలో నెహ్రూ ప్రభుత్వాన్ని గూర్చి విమర్శింపక ఉండజాలము తమిళుల ఒత్తిడికి లొంగి మద్రాసులో తాత్కాలికంగానైనా ఆంధ్ర రాజధానిని ఉంచుకొనుటకు అంగీకరింపక, ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సులభంగా పరిష్కారం కాగలుగుటకు మారుగా, క్లిష్టతరం కావింపబడినది

ఇప్పుడు మరల ప్రధాని నెహ్రూ కన్నడిగుల ఒత్తిడికి లొంగి, భాషారాష్ట్ర విభజన సమస్యలో లేనిపోని క్రొత్త సమస్యలు ఉత్పన్నం అగుటకు దారితీయుచున్నారు. శ్రీ నెహ్రూవంటి నాయకునకు, కేంద్రప్రభుత్వంలో ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తున్నట్టివారికి ఇట్లు చేయతగినది కాదు పటుత్వంతోను, ధైర్య సాహసాలతోను సమస్యలను పరిష్కరింపవలెనేగాని, న్యాయసమ్మతమయినను, కాకపోయినను ఒత్తిడికి లొంగి కార్యానికి దిగుట హర్షింపతగినదికాదు

ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సందర్భంలో ఉత్పన్నంకాగల సరిహద్దు సమస్యల విచారణకై ఒక సరిహద్దు నిర్ణాయక సంఘం ఏర్పడి, ఆంధ్రదేశానికి సంబంధించిన యావత్తు సరిహద్దు సమస్యలను విచారణచేయగలదని భావింపబడింది అట్లు జరపడం సమంజసమే కాని, నాలుగు తాలూకాల భవితవ్యాన్ని తేల్చడానికి మాత్రమే అధికారిని నియమించడంలో సామంజస్యం కనబడుటలేదు మైసూరుతో సంబంధించిన సరిహద్దు సమస్యలను విచారణచేసి కన్నడిగులకు చేరవలసిన ప్రాంతాలను వారికి అప్పజెప్పడమే ఉద్దేశమైనప్పుడు, కన్నడప్రాంతంనుంచి ఆంధ్రరాష్ట్రంలోకి రావలసిన ప్రదేశాల నిర్ణయం ఇప్పుడు తేల్చనక్కరలేదా ?

మైసూరు రాజ్యంలోని కోలారు జిల్లా పూర్తిగా తెలుగుజిల్లా అట్లే చిత్రదుర్గం తుంకూరు జిల్లాలలోని కొన్ని ప్రాంతాలు ఆంధ్రరాష్ట్రంలో చేరవలసిఉన్నవి కావున, ఆంధ్ర-మైసూరు సరిహద్దు సమస్యలను సంపూర్ణంగా పరిష్కరించడం సబబూ, న్యాయమూ కాదా ?

ఆంధ్రరాష్ట్రం ఏర్పడినతరువాత సరిహద్దు నిర్ణాయక సంఘం ఏర్పాటుచేసికొని సమస్యల నన్నిటినీ పరిష్కరించుకోవచ్చునను వాదం స్థూలంగా బాగానే కనపడవచ్చును. కాని, ఇప్పుడు కొన్ని సమస్యలను పరిష్కరించడానికి అధికారిని నియమించడం జరుగుతున్నప్పుడు, మిగత సమస్యలనుకూడ ఇప్పుడే తేల్చుకోవడం శ్రేయస్కరం ఏ కారణంచేతనైనా అది ఇప్పుడు సాధ్యపడనియెడల ఆంధ్రదేశపు దక్షిణ సరిహద్దులనైనను వెంటనే పరిశీలించి, పరిష్కరించడం అవసరం అనగా, మనకూ తమిళ ప్రాంతానికీ గల సరిహద్దులను నిర్ణయించాలన్నమాట సేలం, చెంగల్పట్టు మొదలయిన తమిళ జిల్లాలలో చేరియున్న తెలుగు ప్రాంతాలనుకూడ వెంటనే ఆంధ్రరాష్ట్రంలో చేర్చవలెను ఒరిస్సా మధ్యప్రదేశ్ మొదలైన ఉత్తర సరిహద్దుల విచారణ ఆంధ్రరాష్ట్రం ఏర్పడినపిమ్మట నిర్ణయించుకోవచ్చును

కాబట్టి, బళ్ళారి తాలూకా విచారణతోబాటు ఆంధ్ర-మైసూరులకు, ఆంధ్ర అవశిష్ట మద్రాసునకు గల సరిహద్దు సమస్యలు వెంటనే నిర్ణయింపవలసిఉంటుంది ఆంధ్ర శాసన సభ్యులు, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ తగిన పట్టుదలతో ఇందుకు పూనుకోవలసినదని మా అభిప్రాయం.

# మన రాజధాని

హైదరాబాదు రాజ్యాన్ని భాషాప్రయుక్తంగా విభజించి, తెలంగాణాతోకూడ విశాలాంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కావించడం ఎంతయు వాంఛనీయం అట్టి విశాలాంధ్ర ఏర్పడినయెడల హైదరాబాదు నగరమే ఆంధ్ర రాజధాని కాగలదు ఈ విషయంలో ఎవ్వరికినీ ఎట్టి అభ్యంతరం ఉండదు ముక్కోటి ఆంధ్రులూ వాంఛిస్తున్నది ఇదే

ఏకారణంచేతనైనా కేంద్రప్రభుత్వం హైదరాబాదు రాష్ట్రాన్ని ఈవిధంగా వెంటనే విభజించడానికి అంగీకరించకపోయినా, లేక మరి యే ఇతర కారణాలచేతనైనా కేంద్ర ప్రభుత్వం తాత్కాలికంగానైనా హైదరాబాదును ఆంధ్ర రాజధానిగా అంగీకరింపకపోయినా, ఇది సాధ్యపడేది కాజాలదు. అట్టిసందర్భంలో తాత్కాలిక రాజధానిగ మరి యొక పట్టణాన్ని ఏర్పాటుచేసికోవలసిఉంటుంది

రాష్ట్రాన్నిగూర్చిన రాద్ధాంతసిద్ధాంతాలూ, చర్చలూ విశాలంగా సాగుతున్నాయి ఆయా రాజకీయ పార్టీలు తమ తమ పార్టీ దృష్ట్యా వేరువేరు ప్రదేశాలను సూచిస్తున్నాయి ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం సుస్థిరంగా ఏర్పడి సర్వాంధ్రజాత్యభివృద్ధికి అనుగుణమైనట్టి అనుకూలమైనట్టి ప్రదేశాన్ని నిర్ణయించడం భావ్యం యావదాంధ్ర జాతిశ్రేయస్సును లక్ష్యంలో ఉంచుకొని ఈ సమస్యను పరిష్కరింపవలెను అంతేకాని సంకుచితమైన ప్రాంతీయాభిమానాన్నికాని దేశానికి అహితకరమైన ముఠా ప్రయోజనాలనుకాని అనుసరించి రాజధానీనిర్ణయం జరిగినయెడల ఆంధ్రదేశానికీ ఆంధ్రజాతికీ తీరని అపచారం జరుగగలదు

కావున, హైదరాబాదు ఇప్పుడే ఆంధ్ర రాజధాని కాజాలనప్పుడు, ప్రత్యామ్నాయంగా ఒక తాత్కాలిక రాజధానిని ఏర్పాటుచేసికొనవలెను ఈ తాత్కాలిక రాజధానిలో భవననిర్మాణానికి ఎక్కువ ధనవ్యయం చేయనవసరం లేకుండాను, వెంటనే కావలసిన కార్యాలయాలకు, ఆ కార్యాలయాలలో పనిచేసే ఉద్యోగులకు వసతులు, అనుకూలాలు సిద్ధించగల ప్రదేశాన్ని నిర్ణయింపవలసి ఉంటుంది అంతేకాకుండా ఈ రాజధాని ఆంధ్రదేశానికి మధ్యస్థంగాను, రాకపోకలకు అనుకూలంగాను ఉండవలెను ఆహారపదార్థాల సరఫరాకు, నీటి సౌకర్యాలకు వీలుగాకూడా ఉండవలెను.

ఈ దృష్టితో చూచినయెడల బెజవాడ అన్నివిధాల తగియుండగలదు బెజవాడ, గుంటూరు, మచిలీపట్నం, నూజవీడు మొదలైన నగరాలలో వేరువేరు కార్యాలయాలను ఏర్పాటుచేసికొని, బెజవాడను రాజధానీనగరంగా చేసికొన్నయెడల వెంటనే ఈ సమస్య పరిష్కారం కాగలదు లేనియెడల ఏ తిరుపతిలోనో, విశాఖపట్టణంలోనో రాజధానిని ఏర్పాటుచేస్తే, అది అందరకూ అందుబాటులో ఉండదు, అనుకూలంగానూ ఉండదు

బెజవాడ ఇటు సర్కారులకు, అటు రాయలసీమకు అందుబాటులో ఉండడమేకాక, తెలంగాణాకుకూడ సన్నిహితంగా ఉండగలదు తద్వారా విశాలాంధ్రోద్యమం బలం పోసికోగలదు

కాని, బెజవాడను రాజధానిగ చేసికొనే విషయంలో రాయలసీమవారు అంత అనుకూలంగా ఉన్నట్లు తోచదు పదహారు సంవత్సరాలక్రితం కొంతమంది రాయలసీమ వారికీ, సర్కారు ఆంధ్రులకీ మధ్య జరిగిన సంభాషణల ఫలితంగా శ్రీబాగు ఒడంబడిక వచ్చినది ఈ ఒడంబడిక ద్వారా హైకోర్టునుకాని, రాజధానినికాని రాయలసీమవారు తమకు కావలసినదానిని కోరవచ్చును దీనిని పురస్కరించుకొని కొంతమంది రాయలసీమ నాయకులు రాజధానీనగరం రాయలసీమలోనే ఉండవలెనని పట్టుబడుతున్నారు

దేశాభ్యుదయదృష్ట్యా ఈ కోరిక అంత వాంఛనీయం కాజాలదని మా విన్నపము ఇందువల్ల శ్రీబాగు ఒడంబడిక ద్వారా తమకు లభించినదని చెప్పుకొను హక్కును చలాయించుకోవడం మాత్రమే జరుగగలదు

రాజధానీ నగరం రాయలసీమలో ఉన్నందువలన రాయలసీమవాసులకు కలిగే ప్రయోజనం ఏమంత ఉండజాలదు కాని రాయలసీమకు కావలసిన ప్రాజెక్టులూ, విద్యుచ్ఛక్తి నిర్మాణాలూ, పరిశ్రమాభివృద్ధికి కావలసిన సాధనాలు సమకూర్చితే ఎక్కువ ప్రయోజనం ఉండగలదు ఆంధ్ర ప్రభుత్వం ఇవి జరిగేటట్లు చూడవలెను

కాబట్టి, రాయలసీమవారు ఈతరుణంలో తెలుగు దేశ క్షేమానికి అనుగుణంగా బెజవాడలోనే రాజధానీనగరం ఏర్పడేటట్లు ప్రయత్నింప మా అభ్యర్థన

# హాలీ సిక్కా

" మ నీ షి "

హైదరాబాదులో ఏప్రిల్ ఒకటవ తేదీనుంచి హాలీ కరెన్సీకి బదులుగా కల్దారు కరెన్సీ చలామణీలోకి వచ్చింది భారతవర్షం లోని అన్నిప్రాంతాలలోను చలామణీలోఉన్న కరెన్సీకి కల్దారు కరెన్సీ అని అంటారు హైదరాబాదులో కల్దారు కరెన్సీ కొంత వరకు చలామణీలో నున్నప్పటికీ హైదరాబాదు ప్రభుత్వం ప్రత్యేకంగా తన కరెన్సీని చలామణీలోకి పెట్టింది ఆ కరెన్సీయే హాలీ కరెన్సీ అనీ హాలీ సిక్కా అనీ వ్యవహరింపబడుతూన్నది

హాలీ కరెన్సీలోకూడ కల్దారు కరన్సీలోవలెనే రూపాయలు, అర్ధరూపాయలు, పావలాలు, అణాలు మొదలైన చిల్లర నాణెములు కూడ ఉన్నవి అయితే ఈ హాలీ సిక్కా కల్దారు సిక్కాకంటె విలువలో ఆరవవంతు తక్కువది అనగా ఆరు కల్దారు రూపాయలకు ఏడు హాలీ రూపాయలు అవుతవి ఆలాగే ఆరు కల్దారు అణాలకు ఏడు హాలీ అణాలు ఇస్తారు నూరు హాలీ రూపాయలకు రూ 83-5-3 కల్దారు రూపాయలు ఒక కల్దారు రూపాయికి రూ 1-2-8 హాలీ నాణెములు సమానం అన్నమాట

బ్రిటిషువారి పరిపాలనాకాలంలో యావద్భారతానికి కల్దారు నాణెమే లీగల్ టెండరు అయినప్పటికీ తిరువాన్కూరు హైదరాబాదు సంస్థానాలలోమాత్రం ప్రత్యేక కరెన్సీలు చలామణీలో ఉంటున్నవి హైదరాబాదు సంస్థానంవలెనే తిరువాన్కూరు సంస్థానంకూడ ప్రత్యేక నాణెమును చలామణీలోకి తీసికొనివచ్చినది కానైతే ఈ కరెన్సీలు ఆయా సంస్థానాలలో మాత్రమే చలామణీ అవుతూవచ్చాయికాని సంస్థానాల బయట అవి చెల్లవు

ప్రత్యేక కరెన్సీ నాణెముల చలామణీ అమలులో ఉండే సంస్థానాల పొలిటికల్ ఏజెంట్సుకు బ్రిటిషు ప్రభుత్వం 1870 సంవత్సరంలో ఒక తాకీదును పంపించింది సంస్థానాలలోనూ యావద్భారతవర్షంలోనూ ఒకేవిధమైన కరెన్సీ చలామణీలో ఉండడం భావ్యమనీ కాబట్టి అప్పటికి ఆగిపోయిన మింటులనూ, గత అయిదు సంవత్సరాలనుంచీ తమతమ ప్రత్యేక నాణెములను తగినంతగా చలామణీ చేయనటువంటి సంస్థానాల కరెన్సీని రద్దు చేయవలసిందిగాను అటువంటివానిని తిరిగి ప్రారంభించుటకు వీలులేకుండాను బ్రిటిషు ప్రభుత్వం ఆదేశించినది కాని, ఈ ఆదేశం వల్ల తమ ప్రతిపత్తులకు భంగం కలుగుతుందనీ, సంస్థానాలలోని వర్తకులకు అనవసరమైన చిక్కులు కలుగగలవనీ పైగా ఈ కరెన్సీ మార్పిడివలన ఏమంత ప్రయోజనం ఉండబోదనీ తిరువాన్కూరు మొదలైన సంస్థానాలు పోరాడి తమ కరెన్సీ చలామణీలో ఉంచుకొనే హక్కు నిలవబెట్టుకొన్నవి

ఇండియా యూనియనులో హైదరాబాదు చేరినతరువాతనూ, ఆర్థిక విలీకరణం ఏర్పాటునబట్టి హైదరాబాదులో హాలీ కరెన్సీ ఉండడానికి అవకాశంలేదు 1321 ఫసలీ హైదరాబాదు కరెన్సీ చట్టాన్ని 1327 ఫసలీ హైదరాబాదు పేపరు కరెన్సీ చట్టాన్ని కేంద్రప్రభుత్వం రద్దుచేసింది 1950 జనవరి 26 తేదీనుంచీ కొత్త రాజ్యాంగవిధానం అమలులోకి రావడంతోనే హైదరాబాదులో ఇండియా కరెన్సీ సంపూర్ణంగా చట్టబద్ధమైన కరెన్సీగా రూపొందించబడినది అందుచే హైదరాబాదు ప్రజలకు ఇండియా కరెన్సీ బాగా పరిచయమైన కరెన్సీ అయిపోయింది కానైతే ఇప్పుడు అమలులో నున్న హైదరాబాదు కరెన్సీ క్రమంగా ఉపసంహరింపబడుతుంది ప్రస్తుతం 40 కోట్ల రూపాయల విలువగల హాలీ కరెన్సీ అమలులో ఉన్నది ఇది రెండేళ్ళలోగా చలామణీనుంచి పూర్తిగా రద్దుచేయబడగలదు గత మూడేళ్ళలోను 17 కోట్ల హాలీ కరెన్సీ ఉపసంహరింపబడినది

నవాబు సర్ సాలార్ జంగ్ కాలంలో 1265 ఫసలీలో అనగా 1856 క్రీస్తు శకంలో హైదరాబాదు టంకశాల తొలిసారిగా నిర్మింపబడినది అది ఆనాడు "సుల్తాన్ షాహీ"లో ఏర్పాటుచేయబడి అటుపిమ్మట "దారూషాఫా"లో స్టాంపు డిపార్టుమెంటుతో కూడ చేర్చబడినది 1904 నుంచీ ఖైరతాబాదులో నెలకొల్పారు

1893 వరకు పాత పద్ధతిననుసరించి చేతితోనే నాణాలు తయారుచేస్తూవచ్చారు 1894 లో యంత్రాలమీద నాణాలను తయారుచేయసాగారు ఆలాగు తయారుఅయిన మొదటి నాణెం "చర్ఖీ" అనేది చలామణీలోకి వచ్చినది ఈ నాణెం 172 5 గ్రెయినుల బరువు ఉంటుంది చేతితో తయారుచేయబడే నాణెంకూడా ఈ తూకంలోనే ఉండేది ఈ చర్ఖీ నాణెంకూడా ఇప్పుడు చలామణీలోనున్న ఉస్మానియా సిక్కా ఆకారంలోనూ, సైజులోనూ ఉండేది నాణెం ఎదుటి భాగంలో నాణెం ముద్రింపబడిన సంవత్సరం, "నిజాం-ఉల్-ముల్క్ అసఫ్ జాహ్ బహాదుర్" అని

ఉండేది రెండవ వైపు "జర్బ్ ఫర్ఖుందా బున్యాద్ హైదరాబాద్ ఖలుస్ మైమనత్ మనూసే 'అనీ ఉంటుంది "జలుస్" అనేమాట పైభాగంలో అప్పటికి రాజ్యాధికారంలోనున్న రాజు పరిపాలనావర్ష సంఖ్య ఉండేది

1904 లో దారూషఫానుంచి ఖైరతాబాదుకి టంకశాల మార్చినప్పటినుంచీ కొత్త నాణాన్ని అమలుపరిచారు ఈ కొత్త నాణానికి వెనుకప్రక్క సుప్రసిద్ధమైన "చార్ మీనార్" భవనం బొమ్మ ముద్రితమైనది తక్కినదంతా కొంచెం ఇంచుమించు ఇదివరకు అమలులోఉన్న చర్వీవలెనే ఉంచబడినా అంతకంటె అందం గానూ ఆకర్షణీయంగానూ ఉండేటట్లు కొద్దిమార్పులు చేయబడి నాయి చార్ మినార్‌లోని ప్రధానమైన కమాను మధ్యభాగంలో అప్పటి పరిపాలకుని పేరులోని మొదటి అక్షరం "మీం" అని చేర్చ బడినది ఈ నాణానికి "హాలీ సిక్కా" అని నామకరణం చేశారు హాలీ సిక్కా అంటే "ప్రస్తుతం అమలులోనున్న నాణెం"అని అర్థం ఇప్పుడు హైదరాబాదు రాజ్యానికి రాజప్రముఖ్‌గానున్న నైజాం రాజ్యాధికారానికి వచ్చినప్పుడు చార్ మీనార్ కమాను మధ్యనుండిన "మీం" అనే అక్షరానికి బదులు "ఐన్" అనే అక్షరం వచ్చింది ఈ అక్షరాలు ఉర్దూ లిపిలో ఉంటాయి

1920 సంవత్సరంలో నిక్కెల్‌తో తయారుచేయబడిన గుండ్రని అణా నికెల నాణాలు జారీచేయబడినవి 1937 లో ఈ గుండ్రని అణాపోయి చౌకంగాఉన్న అణా నాణాలు వచ్చాయి గుండ్రని ఆకృతిలో ఉండే ఈ నిక్కెల్ అణా నాణాలనూ, అలాగే గుండ్రంగా ఉండే పావలా నాణాలను గుర్తించడంలో కొంత చిక్కుగా ఉండేది కాబట్టి గుండ్రని అణాకు బదులు చౌకంగా ఉండే అణా ముద్రింపసాగారు

1918 లో హైదరాబాదు ప్రభుత్వం పేపర్ కరెన్సీ చలామణీచేసినది 1939 వరకు ఈ నోట్లు ఇంగ్లీషులోనే అచ్చవుతూ వచ్చాయి ఈ నోట్లను ఇండియాలోనే అచ్చువేయించుటకు 1938 లో హైదరాబాదు ప్రభుత్వం నిశ్చయించినది ఇండియా గవర్న మెంటుద్వారా నాసిక్‌లోని సెక్యూరిటీ ప్రింటింగు ప్రెస్‌లో నోట్లు అచ్చువేయడానికి ఏర్పాట్లు చేయబడినవి పాతనోట్లలో ఉండే ప్రధాన లక్షణాలు ఈ కొత్త నోట్లలోకూడా ఉన్నప్పటికీ ఇవి వెను కటివాటికంటె సైజులో చాలా చిన్నవి ఫోర్జరీ నోట్లు తయారుచేయ డానికి వీలులేకుండా ఈ నోట్లలోని వర్ణవిన్యాసం క్లిష్టతరం చేయబడినది నోట్లు అచ్చుపడిన సంవత్సరాలకు బదులు నోట్ల క్రమసంఖ్యమాత్రం పాతనోట్ల క్రమసంఖ్య తరువాతనుంచీ అచ్చు వేయబడినది

1939 లో కొత్త నోట్లు అయిదు పది రూపాయలవి మొదటిసారిగా జారీ అయినవి ఆ మరచటి సంవత్సరం నూరు రూపాయల నోట్లూ మరి రెండేళ్లకు వేయి రూపాయల నోట్లు వచ్చాయి 1943 లో రూపాయి నోట్లు చలామణిలోకి వచ్చాయి ఈ రూపాయి నోట్లు హైదరాబాదులోని సెంట్రల్ ప్రెస్‌లో అచ్చు అయి స్టాంప్స్ డిపార్టుమెంటు ఆజమాయిషీలో నెంబరింగు మొద లైనవి జరుగుతూ వచ్చాయి

1945 లో హైదరాబాదు టంకశాల 1,388 బంగారు అష్రాఫీలను 65 అర్ధ అష్రాఫీలను 439 పావు అష్రాఫీలను అష్రాఫీలో ఎనిమిదవవంతు నాణాలను 1870 జారీ చేసింది బంగారు ధరవరల తేడాపాడాల మూలకంగా ఈ అష్రాఫీ విలువ నిలకడగాలేక మారుతూవచ్చింది

కిన్నెర


మనోహరమైన పరిమళానికి

31
301
3001

జవ్వాది వత్తులు

సుగంధస్వర్గం

S. V. మునుస్వామి అండ్ బ్రదర్సు

(అగరు ప్రసిద్ధ అగరువత్తులు తయారుచేయువారు)

19 గోవింద వప్ప నాయక్ వీధి మద్రాసు 1

హెడ్ ఆఫీసు మద్రాసు — బ్రాంచి బెంగుళూరు

ఇంగ్లీషు విద్యాబోధిని

ఒకరి సహాయ మక్కరలేకయే ఆంగ్లభాషను తేలికగ నేర్చుకొను టకు వీలుగ వ్రాయబడినది 30 దినములలో మంచి భాషాజ్ఞానమును నేర్వవచ్చును వెల 1-0-0

ఆధునిక కామశాస్త్రము

స్త్రీ పురుషులకు సంబంధించిన అనేక రహస్య విషయములు, పాశ్చాత్యుల పద్ధతుల ననుసరించి విపులీకరింపబడినవి వెల 3 0 0 పోస్టుఖర్చు వేరు

ఈశ్వరి అండ్ కో
పోస్టుబాక్సు 139 - మద్రాసు 1

ఆ సంవత్సరంలోనే 204 లక్షల రూపాయల విలువగల వెండి నాణాలను ముద్రించడం జరిగినది 1 69 94 000 రూపాయి నాణెములను 27 10 000 అర్ధ రూపాయిలూ 47 32 000 పావలాలూ 69 52,000 బేడలూ ముద్రణ చేశారు

82 23 200 అణా నాణాలూ 76 60 800 రెండు దమ్మిడీల విలువగల నాణాలూ జారీ అయినవి ఈ రెండును బ్రాంజ్‌తో తయారుచేయబడినవే

11 85 00,000 హాలీ రూపాయల విలువగల నోట్లు 1945 లో అచ్చు వేయబడినాయి అందులో 3 16 00 000 రూపాయి విలువగల నోట్లు మిగతవి 5 10 100 1000 రూపాయల విలువ గలవి

ఏప్రిల్ నెలనుంచి హాలీ సిక్కా రద్దుచేయబడినది కాకైతే ప్రస్తుతం అమలులో ఉన్నట్లుగానే మరి రెండు సంవత్సరాలవరకు హాలీ సిక్కా కల్దారు సిక్కా రెండూ చలామణిలో ఉండగలవు ఈ రెండు సంవత్సరాల కాలపరిమితిలో హాలీ సిక్కా క్రమేణా ఉపసంహరింపబడుతుంది హాలీ సిక్కా రూపాయి నాణాలూ కరెన్సీ నోట్లు ఈ కాలపరిమితిలో మరి ఏమాత్రం జారీచేయబడవు

అయితే ఈ సిక్కా మార్పిడివల్ల కొన్ని కొత్త పరిస్థితులు ఉత్పన్నం కాగలవు హాలీ నాణెం ఉపసంహరణం జరిగి కల్దారు నాణెం పూర్తిగా అమలులోకి వచ్చేపర్యంతం కొన్ని కొన్ని తాత్కాలికమైన సర్దుబాటులు జరుగగలవు వీటిని సరియైన పద్ధతిలో ప్రభుత్వం ప్రజలూ పరిష్కరించవలసిఉంటుంది

మొట్టమొదటిగా కలిగే ఫలితం చిట్టా ఆవర్జాల పద్ధతిలో మార్పురావడం హైదరాబాదులోని వర్తకులకు తమ పద్దులను హాలీ నాణెంలోనే వ్రాసుకోవడం పరిపాటి ఇప్పుడు హాలీ నాణానికి బదులు కల్దారు నాణెపు పద్దులను ప్రారంభించవలసిఉంటుంది ఏప్రిల్ మొదటితేదీ ప్రభుత్వ వ్యవహారాలకు సంవత్సరప్రారంభమయినా కొంతమందికి జనవరి ఒకటవ తేదీ సంవత్సరారంభం అట్లాగే మరి కొంతమంది దీపావళినుంచి కొత్త పుస్తకాలను ప్రారంభిస్తారు కావున ఈ మధ్యకాలంలో పద్దులు వ్రాసుకొనటంలో కొంత అస్తవ్యస్తం కలుగుతుంది అయినప్పటికీ ఇది ఏమంత పెద్దవిషయమూ కష్టసాధ్యమైనదీని కాదు

కాని, కొద్ది జీతాలను సంపాదించేవారిలోను కార్మికులలోను కొంత అపోహ బయలుదేరినది తక్కువ విలువగల హాలీనుంచి ఎక్కువ విలువగల కల్దారులోకి నాణెం మారినందున జీవితప్రమాణం పెరుగగలదనీ, కావున హాలీ సిక్కాలో జీతాలుపొందుతున్నవారికి కల్దారు సిక్కాలో అదే జీతాలను ఇవ్వవలసి ఉంటుందని అంటున్నారు అయితే, ఈ ఆందోళనకు కొంతవరకు తావు లేకపోలేదు



డాక్టర్ సి సత్యనారాయణ ఇ ఎన్ టి డిపార్ట్‌మెంటు హెడ్ స్టాన్లీ హాస్పిటల్ మద్రాసు—డాక్టర్ జి ఫోర్డుహమ్ లోర్డో విశ్వవిద్యాలయం ఇ ఎన్ టి సర్జన్ ప్రపంచ ఆరోగ్యసంస్థ పక్షాన ఇటీవల ఎలుపురు ప్రఖ్యాతులైన డాక్టర్లు మనదేశానికి వచ్చినప్పుడు మద్రాసులో తీయబడిన ఫొటో

ప్రభుత్వం తక్కువ విలువగల చిల్లర నాణాలను కల్దారులో విశేషంగా సరఫరా చేసినయెడల ఈ ఇబ్బంది చాలవరకు తొలగిపోగలదు ముఖ్యంగా దీదా టిక్కికి అనుకూలం కలిగేటట్లు దమ్మిడీ నాణాలను విశేషంగా అందుబాటు చేయవలసి ఉంటుంది ఈ మార్పిడికాలంలో చిల్లర నాణాలు ఎంత ఎక్కువగా సప్లయి అయితే అంత ఎక్కువగా సదుపాయం కలుగుతుంది కేంద్రప్రభుత్వం ఇందుకు తగిన చర్యలు తీసికొని, ప్రజలకు ఏవిధమైన ఇబ్బందిలేకుండా చూడగలదు

హాలీ సిక్కా రద్దుతో పూర్వకలిఅం కడపటి చిహ్నం తొలగిపోయింది

# Tonsillitis?

## Avoid surgeon's knife




A regular course of Tonsinol pills and painting the throat with the special Tonsinol solution radically cures the enlarged tonsils and adenoids. A safe specific for children and grown-ups. Thousands of satisfied patients and their doctors have acclaimed it as the only known cure for tonsillitis.

Try Tonsinol before you resort to surgical operation

# TONSINOL

**CURES ENLARGED AND SEPTIC TONSILS WITHOUT OPERATION.**

Available at all chemists or write direct to

40 days course Rs 9/-
20 days course Rs 5/-

**TONSINOL LABORATORY,** 53, Govindappa Naick St., G.T Madras I

Every order should follow 50% as advance

"NO RELAPSE THOUGH 10 YEARS PASSED"

B S Murthy M P Madras

Writes —

I have tried Tonsinol and Nostrinol for my sister Srimati K. RAJYA-LAKSHMI in the year 1941 for enlarged Tonsils and Nasal-Growth She was completely cured and since then there is no relapse

I have great pleasure in strongly recommending the Tonsinol and Nostrinol medicines for the suffering humanity as they are efficacious harmless and saves patients from the pains of operation.

(Sd) B S MURTHY

---

టెలిఫోన్ 2729 టెలిగ్రాం టాన్‌సినాల్

# టాన్‌సినాల్ (రిజిష్టర్డ్)

సమస్తమైన గొంతు కండలకు అమోఘమైన దివ్యౌషధము

## 23,500 టాన్సిల్సు కేసులకు పైగా నయము చేయబడిన

40 దినములకు 9-0-0, 20 దినములకు 5-0-0 వి పి చార్జి 1-0-0

# నాస్ట్రినాల్

ముక్కులో కండలు పెరిగి శ్వాసకు అడ్డుపడటం వాసన సరిగ్గా తెలియకపోవటం మాటికి మాటికి చీదటం, తుమ్ములు ఎక్కువగా రావటం వీటిమూలాన వచ్చే తలనొప్పి వక్షుభారకం మొదలైనవాటిని అమోఘంగా కుదుర్చుతుంది నాస్ట్రినాల్ దీన్ని చిన్నవారు పెద్దవారు స్త్రీ పురుష విచక్షణలేకుండా వాడవచ్చు వెంటనే గుణమిస్తుంది

పెద్దబుడ్డి వెల రు 4-8-0 చిన్నబుడ్డి వెల రు 2-8-0 వి పి చార్జీ వేరు

ఆర్డరుతో సగంసొమ్ము అడ్వాన్సుగా పంపించాలి మా మందులు అన్నిషాపులలోనూ దొరకును

చీఫ్ స్టాకిస్ట్స్ దాదా అండ్ కో కెమిస్ట్స్ అండ్ డ్రగ్గిస్ట్స్,
వైదియప్ప నాయకన్ స్ట్రీట్, మెద్రాస్ 3

కావలసినవారు **టాన్‌సినాల్ లేబరేటరి**
53, గోవిందప్ప నాయకన్ వీధి, జి టి మదరాసు-1.

# రూపక రచన

భూపతి లక్ష్మీనారాయణ రావు

శ్రవ్యకావ్య దృశ్యకావ్యముల రచనా విధానమున విశిష్టమగు భేదము కలదు ఉపదేశమార్గము ననుసరించునవి శ్రవ్యకావ్యములు పురాణేతిహాసములందలి ఇతివృత్తముల నాధారముగగొని ప్రజల యందు న్యాయధర్మాది జ్ఞానమును కలిగించుటయు, ఆనుషంగిక ముగ వారి హృదయములను ఆర్ద్రములుగనొనర్చి సాత్త్వికానంద మును గూర్చుటయు శ్రవ్యకావ్యముల ప్రధానప్రయోజనము ఈ ప్రయోజనమును సాధించుటలో కవి ప్రత్యక్షముగ తానై విషయమును గూర్చి యుపన్యసించుటకును న్యాయధర్మాదుల సత్యాసత్యముల మున్నగువానిని తార్కికముగ వివరించుటకును వీలున్నది భారత రామాయణాదుల రచనలో వ్యాసవాల్మీకులు పాఠకుల మనోనయనము నెదుట సర్వదా ప్రత్యక్షమగుచునేయుందురు సన్నివేశములనుబట్టి పాఠకులు తన్మయులగునట్టి స్థితి కూడ సాధారణముగ వర్ణనలనుబట్టి యేర్పడుచున్నది ఇట్టి మహాకావ్యములలోకూడ కవులు మరుగుపడి యుండి పాత్రల సంభాషణాప్రవర్తనాదుల మూలమున ఇతివృత్తమును పోషించిన ఘట్టములే ఎక్కువ ఆకర్షణీయములుగ రసవంతములుగ, ఉన్నవనుటలో సందేహములేదు అనగా నాటకీయత అను లక్షణము ప్రాధాన్యము వహించిన ఘట్టములే మిక్కిలి హృదయాకర్షకములగుచున్నవని తాత్పర్యము సంస్కృతభారతమును అనువదించుటలో తిక్కన నాటకీయమార్గమునే ఎక్కువగా అనుసరించినాడు గాథాపాఠకునివలె కథచెప్పుట తిక్కన అలవాటుకాదు ఆయా యితివృత్తప్రవృత్తికి వలయు పాత్రలను ప్రవేశింపచేసి మానవస్వభావోచితమగు వారిప్రవర్తనలను సంభాషణలను వారి భావావేశ, భావావేగప్రవృత్తులను మనకు ప్రత్యక్షము గావించి తద్ద్వారా మనమనస్సులను తన్మయములుగ నొనర్చి ఆనందమును కలిగించుట తిక్కన అవలంబించిన పద్ధతి తిక్కన భారతభాగములో నాటకోచితములగు ఘట్టము లనేకములట్టివి కలవు శాంత్యనుశాసనికాది పర్వములందలి వేదాంతాది అలౌకికవిషయములు తప్ప తక్కిన ఇతివృత్తమునకు సంబంధించిన ఘట్టముల నన్నియు రసవత్తరములగు సన్నివేశములచే తిక్కన రూపకముల వలె నడిపించియున్నాడు వీరరసప్రధానములగు యుద్ధపర్వము లందుకూడ నిట్టి నాటకీయసంఘటనలు అనేకములిట్టి రచనయందు గలవు ఇతివృత్తమును ప్రకారాంతమొనర్చుటకు పౌరాణికపద్ధతి కంటెను నాటకపద్ధతి ఎక్కువగ సహకరించునని గుర్తించినవాఁడు తిక్కన ఉపదేశమార్గమున గ్రహించుదానికంటె ప్రత్యక్షదృశ్యముచే మానవుఁడు గ్రహించువిషయమునకు మానవుని జీవితముపై ప్రాబల్యమెక్కువ ప్రకృతి విషయములను గ్రహించుశక్తి మానవుని బాహ్యేంద్రియములైదింటికిని కలదు ఐనను నయనమునకు శ్రవణమునకుఁగల గ్రాహకశక్తి ప్రబలమైనది దృశ్యము నాదము, ఈరెంటికిని మనస్సుపైనున్నంత ప్రాబల్యము రుచి వాసన మున్నగువానికిలేదు వస్తువునకును జిహ్వా ఘ్రాణ త్వగింద్రియము లకును సన్నిహితత్వమేర్పడినపుడే వానిప్రవృత్తికెక్కువ అవకాశమున్నది అనఁగా వీనిప్రవృత్తికొక యవధి స్వభావసిద్ధముగ నేర్పడినది నయనేంద్రియ శ్రవణేంద్రియములకుఁగల యవధి విశాలమైనది కావున నయనశ్రవణేంద్రియములద్వారా మనస్సును లోగొనుట సులభము రూపకమునందు ఈవిషయమునకే ప్రాధాన్యమొసంగబడినది ప్రతిపాదింపదలచుకొన్న భావమునకు ఆలంబనమగు ఇతివృత్తమును వర్ణించుటకుమారుగ పాఠకులయెదుట సాధ్యమైనంతవరకు సత్యస్థితికి సన్నిహితమైయుండునట్లు ఇతివృత్తప్రవృత్తిని ప్రత్యక్షీకరింపజేసి పాఠకులహృదయములను ఇతివృత్తమునందు నిమగ్నములొనర్చి వారిహృదయములయందు భావోత్పత్తి కవకాశముకల్పించుట రూపకరచనయం దవలంబింపబడిన విధానము ఈవిధమున రూపకరచన బాహ్యములగు నయనశ్రవణేంద్రియములకును, అంతరింద్రియ ప్రధానమగు మనస్సునకును మిక్కిలి ఆకర్షకమైనది కావుననే శ్రవ్యకావ్యములకంటెను రూపకములందు ఎక్కువ ఆదరము మనకేర్పడినది

మరియు శ్రవ్యకావ్యపఠనమున శ్రోతలకును కావ్యమునకును మధ్య పౌరాణికుడొకఁ డావశ్యకుఁడగుచున్నాడు విద్యావంతులగువారు స్వయముగ కావ్యములను అర్థముచేసికొనగలరు కాని పామరులకట్టి అధికారములేదు ఒకడు పురాణమును పఠించుట పండితుఁడగు పౌరాణికుఁడు దానియర్థమును వివరించుట జరిగిననే తప్ప శ్రోతలు ఆ తృప్తిప్రయోజనమును గాంచలేరు కావ్యానుభవమంతయు వ్యాఖ్యాతయగు పౌరాణికునిద్వారా కలుగవలసినదేకాని ప్రత్యక్షమగు రసానుభూతి శ్రోతలకు కలుగునవకాశమిందులేదు క్వాచిత్కముగనెంతైనను పురాణపఠనముచే చిత్తవికాసము శ్రోతలకు కలిగినచో నది పౌరాణికుని సహజావేశజన్యమగు వాచికాంగికాభినయాదులవలన నేర్పడవలసినదే రూపకప్రదర్శనములందట్లుగాక

ఇతివృత్తమునందలి వ్యక్తులు పాత్రలరూపమున ప్రత్యక్షమగుచుండు టచే, వారి సంభాషణాప్రవర్తనాదులు సామాజికులను మరపింపజేసి ఇతివృత్తికాలమునకు గొంపోయి తన్మయులగనొనర్చి వారియందు రసోత్పత్తిని కలిగింపగలుగుచున్నవి సంగీతనృత్య ఆహార్యక రంగపరికరాదులన్నియు వీరసోత్పాదనయందు దోహదములగు చున్నవి ఇట్లు నాటకము మానవునకానందముగూర్చు నొక విశిష్ట మగు శిల్పముగా నద్దించినది సంస్కృతనాటకరచయితలు సమగ్ర చైతన్యముతోకూడిన సర్వాంగసౌష్ఠవమగు మూర్తిగా నాటకమును సిద్ధింపజేసినారు ఈమూర్తి నిర్మాణమున వీరుచూపిన శిల్పము అసామాన్యమైనది స్థగితము, చిత్రకళ నాట్యము నృత్యము, సంగీతము, కవిత్వము మున్నగువానిలో నే కళను పరిశీలించిచూచి నను దానిస్వరూపమును సమగ్రముగ హేతుబద్ధముగ పరిశీలించి తద్రహస్యమును సంపూర్ణముగ గ్రహించి దానినాదర్శప్రాయమగు నట్లు పోషించి ఔదాత్త్యమును సిద్ధింపజేయుట ప్రాచీనుల లక్షణ మని వ్యక్తముగాకపోదు కళాసౌందర్యమన నేమి? కళకు సౌందర్య మెట్లబ్బుచున్నది సౌందర్యపోషకములగు పరికరములెవ్వి? వానిని గూర్చువిధానమెట్టిది సర్వసాధారణమగు మానవప్రకృతికేది సాత్త్వి కమగు నానందమును గూర్పగలదు మానవమనఃప్రకృతికిని బాహ్యప్రకృతికినిగల సంబంధమెట్టిది ఈరెంటికిని సామరస్యమును గూర్చు కళాప్రక్రియ ఎట్టిది అనువిషయములను ఆమూలాగ్రముగ చర్చించి ఆయాకళలను వీరు పోషించుటయే గాక తమ అనుభవము లను మీమాంసానిర్ణయములను లక్షణరూపమున రచించినారు. అట్లు కళలన్నిటికిని శాస్త్రగ్రంథములేర్పడినవి నాటకరచనవిషయ మునకూడ వీరవలంబించిన విధానము ఎట్లు వీరిప్రయోజనమును సాధించినదియు గమనింపదగిన విషయము

భారతీయుల కవితాకళ నాటకరచనయందు పరాకాష్ఠదశను అందుకొన్నదనిచెప్పవచ్చును పండితకవులు ప్రయత్నపూర్వక ముగ దిద్దితీర్చిన కవితాశిల్పము నాటకరూపమును గైకొన్నది కావునది ఉన్నతవర్గమువారి ఆనందమునకై యేర్పడినదనియే చెప్పవచ్చును గ్రీకు మున్నగు పాశ్చాత్యనాటకములు సార్వజనీన ములైనట్లు సంస్కృతనాటకములుకాలేదు ప్రాచీనకాలమునుండియు వర్ణవిభేదకారణముగా నేర్పడిన వర్గవిభేదము సంఘమున నెలకొ న్నది ఉన్నతవర్గమువారగు బ్రాహ్మణక్షత్రియుల కుపకరించినట్లు సంస్కృతనాటకములు సామాన్యప్రజకు ఉపకరింపలేదు తమ బుద్ధి ప్రాభవముచే వేదాంతాది వాఙ్మయమును సృష్టించినట్లే బ్రాహ్మ ణులు నాటకమునుగూడ అత్యుత్తమమగు కళగా సృష్టించినారు. ఆ కారణముననే భారతీయవిజ్ఞానము నాటకములందుగూడ స్ఫుట ముగ ప్రతిబింబించినది ఉన్నతాదర్శమును చిత్రించుట భారతకవుల లక్ష్యము తల్లక్ష్యసాధనమున ప్రకృతిసహజములగు కొన్ని విష యములనుగూడ,—అవి లక్ష్యమునకు విరుద్ధములైనచో,—పరిత్య జింపవలసివచ్చినది మానవజీవితము ఉన్నదున్నట్లు చిత్రించుట భారతకవి యుద్దేశముగాదు భారతసాంప్రదాయము భారతీయ జీవితతత్త్వము ననుసరించి జీవిత మెట్లుండవలయును ఎట్టి వ్యవస్థ ఆదర్శనీయము, ఏది అనుసరణీయము అను ఆశయము లను కావ్యముల ఆధారమున ప్రతిపాదించుట ఈ కవుల లక్ష్యము అనగా జీవితసంస్కారము, తన్మూలమున సామరస్యమును గూర్చుట భారతీయ కవుల ప్రధానాశయము వేదవాఙ్మయసర్వ స్వమును ఈవిధముననే నడచినది భారతరామాయణాదులు ప్రత్య క్షమగు నుపదేశమార్గమునగాక మహాపురుషుల జీవితచరిత్ర నాధార ముగాగొని పరోక్షమార్గమున ఈ లక్ష్యమునే సాధించినవి తరు వాతి కావ్యవాఙ్మయమున కవితాశిల్పము ప్రాధాన్యము వహించినను ఈ లక్ష్యమును మాత్రము విస్మరింపలేదు నాటకములయందు గూడ నట్లే ఆదర్శస్థితిని చిత్రించుట ప్రధానవిషయమైనది కవితా శిల్పమును ఇతర లలితకళలును ఈ లక్ష్యమును సాధించుటలో సహకరించినవి అయిన ఇతిహాసరచనకును, నాటకరచనకును, ముఖ్యమగు భేదమొకటి కలదు ఇతిహాసరచనయందు విషయము నకు ప్రాధాన్యమెక్కువ నాటకమున రసమునకెక్కువ ప్రాధా న్యము అనగా మహాకావ్య రచయిత ఇతివృత్తచిత్రణముచే సాధిం చిన పరమార్థమును నాటకకవి రసపోషణచే సాధింపదలచినాడు ప్రేక్షకుల హృదయములను రసానుభూతిచే నార్ద్రములుగ నొనర్చి తన్మూలమున విశ్వజీవితముతో సామరస్యమును గూర్చుట నాటక కవి యాశయము కావున రసపోషణ నాటకరచనయందు ప్రధాన లక్ష్యముగ నేర్పడినది తదనుగుణముగ విషయము భావములు, సన్నివేశములు పాత్రపోషణ ఇత్యాదులు పోషితములైనవి రస సిద్ధికి అనుకూలింపనివియు, రసవిరుద్ధములు నగు విషయములు పరిత్యాజ్యములైనవి ఈ కారణముచే నాటకములయందు ఇతివృత్త పోషణము అప్రాధాన్యమగుటకూడ జరిగినది గ్రీకు నాటకములకు ఇతివృత్తము ఆత్మసదృశమైనదని "అరిస్టోటిల్" ననుసరించి తెలియుచున్నది భారతీయనాటకములందు ఇతివృత్త మాలంబన మును రసపోషణ లక్ష్యమును నగుచుండుటచే నని నాటకమునకు దేహము ఆత్మలవంటివని చెప్పవచ్చును ఈ కారణముచే భార తీయ నాటకరచయిత రసపోషణ కనుకూలించు ప్రసిద్ధేతివృత్తము నాలంబనముగగొని వలయుచో రసోచితములగు మార్పులనుగూడ కావించి ప్రయోజనమును సాధించుచున్నాడు కావున ఇతివృత్తము వాస్తవజీవితమునకు కొంత దూరముగ నుండుటకూడ జరుగు చున్నది

ఇదిగాక నాయికానాయకుల ఇతివృత్త మాధారముగ పోషింపదలచిన భావాదులు ఆర్యమతసంప్రదాయమునకు విరుద్ధము లైనవి కాకూడదు ఆర్యమతవిరుద్ధములగు భావములు మానవ

జీవితమున సహజవిఘ్నములేయైనను అవి గ్రాహ్యములుగావు భారతీయ సంఘవ్యవస్థ కంతకును ఆర్యమతసంప్రదాయమే పునాదియగుటచే తద్విరుద్ధములగు భావాదులను ప్రతిపాదింప వీలులేదు మానవుని జీవితమును, వాని ప్రవృత్తియు నత డీ జీవితమునం దనుభవించు ఫలమును వాని పూర్వజన్మసంచితముపై నాధారపడియున్నది ఇట్లు జీవితప్రవృత్తియంతయు కర్మసిద్ధాంతముచే సమర్థింపబడుచున్నది కావున సంస్కృత నాటకములలో వ్యక్తిసాహసప్రయత్నాదులకు ప్రాధాన్యములేదు పాశ్చాత్యనాటకములందువలె నాయకుడు ప్రకృతిశక్తులను ఎదుర్కొనుట వానిని నిర్జించుటకై సాహసించుట ఒకప్పుడు వానిని జయింపజాలక నశించుట మున్నగు విషయములకు మన నాటకములలో ప్రసక్తిలేదు ప్రేక్షకుడు పాశ్చాత్య నాటకములందలి నాయకునితోడను ఒకప్పుడు ప్రతినాయకునితోడనుకూడ సానుభూతిని పొందగలుగు నవకాశమున్నది భారతీయ కర్మసిద్ధాంతము ననుసరించి మానవప్రవృత్తియంతయు విధిప్రాబల్యఫలితమే యగుటచే నాయక ప్రతినాయకు లనుభవించు ఫలములు ఇదివఱకే నిశ్చితములయియున్నవి కావున ప్రేక్షకులకు తత్పరిణామమున ఆసక్తి యేర్పడదు నాటకసన్నివేశముల ఆధారమున పోషితమైన రసానుభూతికి లోనై విశ్వజీవితముతో నైక్యస్థితిని పొందుటయే ఇందు ప్రేక్షకుడు పొందు ఫలము ఈ ముఖ్యభేదము కారణముగ గ్రీకు నాటకములలో వస్తువు ప్రాధాన్యము వహించుచుండ సంస్కృతనాటకములలో రసాస్వాదన ప్రాధాన్యము వహించుచున్నది

ఇక మానవజీవితమున కంతకును మూలాధారములైనవి శృంగారవీరములే యగుటచే నవియే నాటకమున ప్రధానరసములుగ పోషితములైనవి మానవుని ప్రయత్నము లన్నిటికిని రతియు ఉత్సాహమునే ప్రధానకారణము లనుటలో సందేహము లేదు వీనిని రసములుగ పరిణమింపచేయుటలో కవి అద్భుతరసమును సహాయముగ గైకొనుట కలదు భారతీయుల మనస్తత్త్వము ననుసరించి మానవజీవితమునకు దివ్యశక్తితో సంబంధముతప్పదు సత్యధర్మన్యాయముల పాలించి లోకకల్యాణమార్గమున ప్రవర్తించు వ్యక్తికి దైవము తప్పక తోడ్పడుననుట భారతీయుల విశ్వాసము కావున ధర్మప్రవర్తకుడగు నాయకునకు అపజయము వాటిల్లుటగాని, అధర్మప్రవర్తకుడగు ప్రతినాయకుడు జయించుటగాని భారతీయ జీవితతత్త్వమునకే విరుద్ధమగుచున్నది ఈ కారణములచే సంస్కృత నాటకములు విషాదాంతములగుటకు వీలులేదు ప్రకృతిశక్తులను అధర్మప్రాబల్యమును నాయకు డెదుర్కొనలేని సందర్భమేర్పడినచో, దివ్యశక్తి నాయకునకుతోడై ధర్మమును రక్షించుట జరుగవలసియున్నది లేనిచో సత్యమునకు ధర్మమునకు, హానివాటిల్లుట జరుగగలదు అది భారతమతమునకే విరుద్ధము కావున నాటకములందు దివ్యశక్తిసాహాయ్యమున అద్భుతరసము పోషింపబడవలసివచ్చినది లోకహితమునకై తనదేహమును తృణప్రాయముగ బలియొనర్చిన జీమూతవాహనుడును సత్యవాక్పరిపాలనకై సర్వస్వత్యాగమును గావించిన హరిశ్చంద్రుడును పార్వతీపరమేశ్వరులచే రక్షితులగుటకును నాటకములు మోదాంతము లగుటకును నిదియే కారణము తన మహిమను సచ్ఛీలమును లోకమునకు ప్రత్యక్షమొనరించి పరలోకమున కేగిన సీతాపతివృత్తాంతముగూడ నీకారణముచే నాటకమున భవభూతిచే మార్పబడినది ఇట్లు సంస్కృత నాటకముల రచనాప్రణాళిక భారతీయ సంప్రదాయములపై నాధారపడియున్నది భారతీయుల ఇట్టి మనస్తత్త్వమునకు ఇందలి ప్రకృతిపరిస్థితులుగూడ కొంతవరకు కారణములని చెప్పవచ్చును భారతదేశమున ప్రకృతి స్వభావసౌమ్యమైనది ప్రకృతి సర్వదా జీవితసౌఖ్యమున కుపాధియగుచున్నది భగవంతుని వ్యక్తరూపమగు ప్రకృతి ఇట్లు సౌమ్యము సౌఖ్యహేతువు నైయుండుటచే మానవునకు దివ్యశక్తి యెప్పుడును తోడై యుండునను భావము స్థిరముగ నెలకొన్నది పాశ్చాత్యదేశములందలి పరిస్థితులు వేరు తీక్ష్ణములగు ప్రకృతిశక్తులను ప్రతిఘటింపవలసిన అవసరము మానవునకు కలదు ఆత్మరక్షణకును సాధారణమగు సౌఖ్యసంపాదనమునకుగూడ మానవుడు సర్వదా మహాప్రయత్నము చేయవలసియున్నది పాశ్చాత్యమానవజీవితమునందు ఈ వ్యవస్థ నిత్యమైనది వ్యక్తి ధర్మపరుడు అధర్మపరుడు అను వివక్షలేక ఈ ప్రకృతిశక్తులకులోనై నశించుటకూడ నిరంతరము జరుగుచునేయున్నది ఈ కారణముచే సంఘర్షణ యనునది వారిజీవితమున నిత్యప్రవృత్తిగ నేర్పడినది అందు ధర్మమునకే విజయము కలుగుననుటకూడ ప్రకృతిసిద్ధమగు విషయముకాదు దాని ననుసరించి విషాదాంతేతివృత్తములు వారికి నిత్యములుగను ప్రకృతి సహజములుగను కనబడినవి అధర్మమును అన్యాయమును ఎదుర్కొనుటయు వానిని జయింప ప్రయత్నించుటయు ఉత్తమాదర్శములే అయినను విజయము నిశ్చితము కాకుండుటచే జీవితము సాహసప్రధానమగుచున్నది ఈ జీవితవ్యవస్థయే వారి విషాదాంత నాటకములందును ప్రతిబింబించినది ఈవిధమున పాశ్చాత్యనాటకములు ఇతివృత్తవిషయమున జీవితమునకు చాల సన్నిహితమైయుండుట తటస్థించినది కావుననే పాత్రల మనస్సులందు జరుగు భావసంఘర్షణకూడ ఆనాటకములలో చిత్రితమైయున్నది సంస్కృతనాటకములందు అట్టి భావసంఘర్షణకు అవకాశములేదు స్థాయీభావ విరుద్ధములగు నితరభావములకు నాయికానాయకుల మనస్సులందవకాశమేర్పడినచో స్థాయికి భంగమాపాదిల్లగలదు అట్టిచో రసోత్పత్తికే అవకాశముండదు అట్టిచో నాటకప్రధాన ప్రయోజనమే సిద్ధింపకపోవుచున్నది

నాటకరచనయందువయుక్తమైన శైలికూడా రసపోషణనే యనుసరించినది. ఆయా సందర్భములకు తగిన భావాదులను ప్రేక్షకుల హృదయములందుత్పన్నము చేయుటకు శైలి సమర్థమై యుండుట చూడనగును. శబ్ద అర్థ అలంకారధ్వని ఇత్యాదులన్నియు చాల జాగరూకతతో ప్రయుక్తములై భావపోషణ కనుకూలించుచున్నవి. సంస్కృతభాషా పాండిత్యముగల ప్రేక్షకుల కిట్టిరచనలు ఎక్కువ యాస్వాదయోగ్యములైనవి. సామాజికుడుకూడ పండితుడు కళాభిజ్ఞుడు రసజ్ఞుడునై యుండవలెనని శాస్త్రము పేర్కొని యుండుటకూడ గమనింపదగిన విషయము. ప్రేక్షకుడు అట్టివాడైనచో రసోత్పత్తికెక్కువ అవకాశమున్నదని దీనివలన తెలియుచున్నది. దీనినిబట్టి సంస్కృతనాటకములు విద్యావంతులైన ఉన్నతవర్గములవారి వినోదమున కెక్కువగ నుపకరించినవని చెప్పుటకు వీలున్నది. దీనికంతకును ఆకాలపు సాంఘికవ్యవస్థయే కారణమగుచున్నది. కాళిదాసుకాలమునాటికి ఆర్యమత మున్నతదశలో నుండినది. తత్సంప్రదాయములు సంఘమున సక్రమముగ ననుసరింపబడుచుండినవి. కావున తద్విరుద్ధములగు భావములను విషయములను కవులు నాటకములయందు ప్రతిపాదింపరైరి.

నాటకములందితివృత్తము కూడ దానికనుగుణమగు విధముగనే పోషింపబడుచువచ్చినది. ఇదిగాక రాజాస్థానములు రాజప్రాసాదములు భోగములకాకరమైనవి. సంపద్వైభవము కారణమున వారి జీవితము సుకుమారము లలితమునై లలితకళలకాకరమైనది. దానిననుసరించి సారస్వతరచన కూడ తదనుగుణముగనే నడచినది. కాళిదాసుని నాటికే అట్టి వ్యవస్థ సారస్వతమున నేర్పడినదనుటకు అతని విక్రమోర్వశీయ మాళవికాగ్నిమిత్రములే సాక్ష్యములు. శృంగారప్రధానములైన నాటికలన్నియు అట్టి రాజులను రాజాస్థానమందలి నాగరికులగు సంపన్నులను వినోదింపచేయుటకే రచితములైనవనుట అతిశయోక్తికాదు. భోగములకు విలాసములకు ఆకరమైన నాగరకసంపన్నుల జీవితము ననుసరించి నాటకరచనయు శిల్పప్రధానమైనది. అనగా వస్తువుకంటెను రచనావిధానమునకు ప్రాధాన్యమేర్పడినదని అర్థము. వివిధేతివృత్తములను నాటకములందు చిత్రించుటకు మారుగ ఒకవిధమగు ఇతివృత్తమునే ఆలంబనముగగొని కవులు రచనలను సాగింపనారంభించినారు. రత్నావళి ప్రియదర్శిక విద్ధసాలభంజిక, మాళవికాగ్నిమిత్రములవంటివానిలో ఇతివృత్తమున వైవిధ్యము గోచరించుటలేదు. దీనినిబట్టి నాటకరచన రాజాంతఃపురములను ఆశ్రయించినదనియు సాధారణప్రజాజీవితమునకు దూరమైనదనియు తెలియుచున్నది. భాషకూడ జనసామాన్యమునకు చాలదూరమైనది. వివిధప్రాకృతములు సంస్కృతము వ్యాకరణాలంకారాది శాస్త్రములు, చతుష్షష్టికళలు—ఇత్యాదులన్నియు అభ్యసించిన పండితుడే నాటకరచయిత కావలెనని వివరింపబడియుండుటంబట్టి నాటకరచన విశిష్టమగు నొకకళగా నేర్పడినదని చెప్పవచ్చును—

రసపోషణ భారతీయనాటకకర్తల ప్రధానాశయము. ఉద్దిష్టరసానుభూతిని ఇతివృత్తప్రదర్శన మూలమున సామాజికులకు కలిగించుట రచయితయొక్క ప్రధానలక్ష్యము. సన్నివేశములు, సంభాషణలు ప్రతిపాదించు భావములు సంగీతనృత్యాదుల మున్నగునవి యన్నియు ఈ రసపోషణకు సాధనములు. ఉత్తరరామచరిత్ర నాటకప్రదర్శనమునందు తన్మయుడై రసానుభూతినిగాంచిన వ్యక్తి హృదయము ఒకవిధమగు సంస్కారమునకు లోనగుచున్నది. ఉత్తమదంపతులు ప్రేయసీప్రేయసులు నగు సీతారాములకు కలిగిన దుస్సహమగు వియోగబాధను ప్రదర్శనముద్వారా అనుభవించిన సాత్త్వికుడగు సామాజికుని హృదయమార్ద్రమై సీతారాముల విషయమునవేర్పడిన సానుభూతి లోకమందలి ఇతరదంపతుల విషయమునగూడ వ్యాప్తమగుచున్నది. పాపులగు కొందరు పౌరులనుండి పుట్టిన యపవాదమే సీతారాముల హృదయపరితాపమునకు కారణమైనదనెడు జ్ఞానము కరుణరసానుభూతిఫలితముగ నేర్పడుచున్నది. పౌరాణికవ్యక్తులగు సీతారాముల యుదంత మాధారముగ సామాజికుని హృదయమునం దేర్పడిన ఈ చిత్తసంస్కారము జీవితమునందితని ప్రవృత్తినిగూడ సంస్కరించుచున్నది. అట్టివ్యక్తి దంపతులవిషయకమగు నపవాదములను నహింపజాలడనుట వింతకాదు. రసానుభూతివలన జీవితమునందిట్టి సంస్కారమేర్పడుచున్నది.

పురాణశ్రవణమువలనను గురూపదేశమువలనను సిద్ధించు సంస్కారముకంటెను రసానుభూతిచే నేర్పడు నీసంస్కారము స్థిరము విశిష్టమునైనది. ఇట్టి విశిష్టమగు రసానుభవజన్యమగు సంస్కృతి సిద్ధించుటకు నాటకరచనాశిల్పమే ఆధారము. భారతీయ నాటకరచయిత లవలంబించిన శిల్పసర్వస్వమును రసపోషణ నుద్దేశించినది. రూపకముల విషయమున గ్రీకు రోము దేశనాటకకర్తల ఆశయమువేరు. కథాప్రవృత్తి పోషణమును తన్మూలమున వివిధపాత్రల స్వభావవైవిధ్య శీలప్రవర్తనాదులను పోషించుట పాశ్చాత్యుల ఆదర్శము. సాధారణ మానవప్రకృతి వివిధసంఘటనలయందు వ్యక్తమగు మానవుల సహజప్రవృత్తి మున్నగువానిని యథాతథముగ చిత్రించి మానవ మనస్తత్త్వమును సామాజికులు గ్రహించునట్లుచేసి వారికి సంఘమున సామరస్యమును గూర్చుట ఆ నాటకముల ప్రయోజనము. ఆశ కామము క్రోధము ఈర్ష్య దయ అనురాగము ఇత్యాదులన్నియు మానవుని సహజస్వభావములేయనియు అవి ఆయా మానవుని జీవితమునందు కలుగు సంఘటనలను, సంఘర్షణలను బట్టి ఆయాసందర్భములలో వెలికుబుకుననియు, గ్రహించినప్పుడు సామాజికులకు జీవితమును

గూర్చిన సరియగు జ్ఞానమేర్పడుటకు వీలున్నది సద్గుణశీల మేమా
త్రమునలేని దుష్టస్వరూపుడుగాని లోపమేలేని సద్గుణమూర్తి
గాని మానవులయందుండుట జరుగదు అట్లే ఏమానవుడును
ఇతరులందరకును మంచివాడగుటయు కూడ జరుగదు మానవుని
భిన్నప్రవర్తనలకు కూడ మూలములగు కారణములను మందక
పోవు సాధారణమానవ ప్రకృతియే అట్టిది అట్టి సాధారణ మానవ
ప్రకృతిని రూపకములయందు చిత్రించినచో సామాజికులకు మానవ
తత్త్వమును గూర్చిన సదభిప్రాయము కలుగుట కవకాశమున్నది
తోటిమానవుల లోపములతోడను సుఖదుఃఖాదులతోడను మనకు
సానుభూతి యేర్పడి జీవితమున మానవైక్యము ఏర్పడుటకు ఇది
యాధారమగుచున్నదని తత్త్వవేత్తల అభిప్రాయము ఈకారణ
మునుబట్టియే పాశ్చాత్యులు పాత్రపోషణకు ఎక్కువగా ప్రాధాన్యము
నొసంగినారు మరియు మానవుడెంతటి సన్మార్గవర్తియైనను
న్యాయపరుడు ధర్మపరుడు నైనను జీవితమున విజయవంతు
డగునని చెప్పుటకు సాధ్యములేదు ఎందరో సత్పురుషులు ప్రకృతి ప్రభా
వముల నెదిరింపలేక భగ్నహృదయులై నశించినారు అది ప్రకృతి
సత్యము అట్టి ప్రకృతిసత్యమును రూపకములయందు ప్రదర్శించుట
కూడ పాశ్చాత్యుల యాశయములలో నొకటి విజయమునుగాంచు
టయే జీవితమున ప్రధానవిషయము కాదనియు జీవితము తుదకు
భగ్నమైనను ధర్మమును, న్యాయమును సత్యమును వీడక స్థిరు
లై యుండుటయే ఉత్తమమానవలక్షణమనియు ప్రతిపాదించుట
వీరి ఆశయము కనుకనే పాశ్చాత్యులలో ననేకులు ఫలమెట్టిదను
ప్రశ్న కూడ విచారింపక వీరకార్యముల కుత్సహింతురు న్యాయమున
కొకప్పు డపజయముకలుగుట అన్యాయము విజృంభించుటకూడ
ప్రకృతిసహజములగు విషయములే ఈ జ్ఞానమును రూపకముల
ద్వారా ప్రజలకు గల్పించుట అవసరము అట్లుకాక న్యాయ మెల్లప్పు
డును జయించియేతీరునని అభిప్రాయమును ప్రజలయందు ప్రతి
పాదించినచో లోకమున తద్విరుద్ధమగుప్రవృత్తిని ప్రత్యక్షముగ
గాంచుచు ననుభవించుచున్న పామరుల మనస్సులు సందేహాస్పద
ములై జీర్ణములుకాగలవు పాపముకూడ నొకప్పుడు బలవత్తరమై
పుణ్యము నణచివేయుట ప్రకృతియందుకలదనియు ఐనను పాపము
సర్వజనవిద్రోహకరమగుటచే ఉపాదేయము కాకూడదనియు, ప్రజ
లకు బోధించుట ముఖ్యము ఇట్టి సంఘటనల అనుభవముచే సామా
జికులహృదయములు శిక్షితములై సంస్కృతి నందునని పాశ్చాత్యుల
అభిప్రాయము కావున పాశ్చాత్యులు ప్రకృతిసత్యమును యథాతథ
ముగ ప్రదర్శించుట పాత్రలను స్వభావానుగుణముగ చిత్రించుట,
ఇతివృత్తప్రవృత్తిని జీవితప్రవృత్తితో సమన్వయపరచుట, అను
విషయములను నాటకరచనయందు ప్రధానాశయములుగ గ్రహించి
నారు ఉదాత్తేతివృత్తముయొక్క ఆధారమున సామాజికుల మనస్సు
లను సాధారణమానవజీవితముతో సమన్వయపరచి అతీంద్రియ
మగు రసానుభూతిని కలిగించి, తద్ద్వారా హృదయమును శాశ్వత
ముగ రసపరమగునట్లొనర్చి మానవత్వసంస్కృతుల సిద్ధింప
జేయుట భారతీయనాటకకర్తల ఆశయము జీవితసామరస్యము,
సంస్కారము ఈరెండును భారతీయులయు పాశ్చాత్యులయు
ఆశయములని ఇట్లు వ్యక్తమగుచున్నది ఐన వానిని సాధించుటలో
వీరవలంబించిన విధానములువేరు కథాప్రవృత్తి పాత్రపోషణాదు
లకు పాశ్చాత్యులు ప్రాధాన్యమొసంగినారు తద్రసపోషణమున
భారతీయు లవలంబించిన శిల్పమెట్టిది? అని పరిశీలింపవల
యున్నది

రూపకరచనయందు ఇతివృత్త పాత్ర రసపోషణలు ప్రధా
నాంశములు నాటకమునకు సంబంధించిన విషయములను మూడు
ప్రధానవర్గములుగా విభజింపవచ్చును ఇతివృత్తము తద్విభాగము
స్థాయీభావపోషణము, దృశ్యసూచ్యాదివిభాగము ఇతివృత్తానుగుణ
మగు నాయికానాయక నిర్ణయము పాత్రపోషణ నాటకరచనయం
దుపయుక్తమగు భాష ఇవన్నియు నొకవర్గముగ నేర్పడుచున్నవి
నాటకరచయితకు సంబంధించినవర్గమిది రంగనిర్మాణ రంగ పరి
కరములు ఆయాపాత్రలకు తగినవటులను వారి ఆకారరూపగుణ
శీలసామర్థ్యాదులంబట్టి ఎన్నుకొనుట వారికి అభినయమునందు తగు
శిక్షణనొసంగుట ప్రదర్శనమునకు తగిన స్త్రీపాత్రలను నిర్ణయించుట
తత్తద్భావపోషణకనుకూలించు నృత్యగీతాదులను జతపరచుట
ప్రదర్శనకు అనుకూలపరిస్థితుల నేర్పరచుకొనుట మున్నగునవి
నాటకప్రదర్శకునకు సంబంధించిన అంశములై యొకవర్గముగ
నేర్పడుచున్నవి రసానుభవము తదనుభూతిచే సిద్ధించు సాత్త్వికా
నందము సంస్కృతి నైతికనిష్ఠ మున్నగునవి సామాజికునకు
సంబంధించిన విషయములు భారతీయదృక్పథము ననుసరించి రసో
త్పాదనవిషయకమగు నీవర్గమునకు ప్రాధాన్యమెక్కువ నాటక
రచనయందు కవిప్రదర్శించు శిల్పసర్వస్వమును నాటకప్రదర్శకుడు
రంగపరికర నృత్యగీతాభినయాది విషయములతో వహించు శ్రద్ధయు
నటులు వాచికాంగికాభినయములయందు ప్రదర్శించు కళాకౌశల
మును—అన్నియు రసోత్పత్తియే ఉద్దిష్టప్రయోజనముగా కలిగి
యున్నవి నాటకప్రదర్శనకు సంబంధించిన రంగపరికర నృత్య
గీతాది విషయములు నటుల అభినయాది విషయములు నిత్యాదులు
ఇతివృత్తగత సన్నివేశములను భావములను రమణీయముగ
పోషించి రసోత్పత్తినికలిగించు సాధనములు ఈ సాధనసామగ్రి
ఎంతటి యుత్కృష్టమైదైనను నాటకరచనయందు శిల్పముకొరవడి
నచో రసోత్పత్తి కలుగజాలదు నాటకప్రయోజనమును సిద్ధింపదు
కావున నాటకములకు చెందిన వివిధవర్గము లన్నిటియందును నాటక
రచనావిధానము శిల్పవిషయమునందు ప్రధానమగుచున్నది రూపక
మున పోషింపదలచుకొన్న ప్రధానరసమెద్దియో కవిముందుగా

నిశ్చయించుకొని తద్రసపిద్ధికి అనుకూలించు ఇతివృత్తము, సన్ని వేశకల్పనము ప్రధానేతివృత్తమునకు పోషకములగు ప్రాసంగి కేతివృత్తములు అంగిరసపోషకములు ననుకూలములునగు అంగ రసములు నున్నగునానిని ఏర్పరచుకొనుట రసవత్తరమగు ఇతివృత్తభాగములను మాత్రమే రంగముపై ప్రదర్శించుట రస హీనములైన కథాభాగములను ప్రసంగవశమున పాత్రలచే సూచింప జేయుట ఉదాత్తములు చిత్తవికాసకరములు నగు భావములకు శ్రావ్యగీతారూపము నొసంగుట కథయందాసక్తి సడలకుండునట్లు ఆదినుండి తుదివరకును సామాజికుని చిత్తము రంగముపై కేంద్రీ కరించునట్లు ఇతివృత్తమును నడపుట ప్రకృతిసహజమగు క్రమమున విభావాదిప్రేరణచే సుసమృద్ధమైనస్థాయీభావము పోషితమై రసముగ పరిణమించునట్లు సన్నివేశాదులను చిత్రించుట ఇత్యాదులన్నియు నాటకరచనాశిల్పమునకు సంబంధించిన విషయములు

ఆదర్శమగు సన్నివేశ మాధారముగ హృదయమున బోధ చెందిన స్థాయీభావమును ఆస్వాదయోగ్యమగునట్లు చిత్రించుట భారతీయ నాటకములందు ప్రధానవిషయము ఈ స్థాయీభావమే క్రమపరిణామమునకు లోనై రసస్వరూపమున సామాజికునిచే నను భవింపబడుచున్నది కావున నాటకరచనయందు కవిదృష్టియంతయు స్థాయీభావపోషణపై కేంద్రీకరింపవలసియున్నది తద్భావమునకు విరుద్ధములగు విషయము లేమాత్రము ఇతివృత్తమున ప్రవేశించి నను నవి తద్వికాసమునకు ప్రతిబంధకము లగును అట్టిచో స్థాయీ భావము రసముగ పరిణమించు నవకాశమే కలుగదు శాంతరస నిరూపణము ప్రధానముగాగల ఘట్టమున శృంగారవిభావమును ప్రవేశింపజేయుట అట్టి రసవిరుద్ధమగు సంఘటనకు ఉదాహరణ అట్లే శృంగారప్రధానమగు నాయికానాయకప్రణయకలహాత్మక సన్నివేశమున నాయకుడు జీవిత అనిశ్చితను క్షణభంగురతను ఉపన్యసించి నాయిక ననునయింపజూచుట అట్టిదే ప్రేయసీవియో గమునకులోనై కరుణవిప్రలంభము ననుభవించుచున్న నాయకునిచే ప్రకృతిరామణీయకమును వర్ణింపజేయుటవలన స్థాయిభావమునకు భంగము కలుగగలదు అట్లే అన్యోన్యసమాగమమునకు చిర కాలమునుండి యువ్విళ్లూరుచున్న ప్రేయసీప్రేయసులు ఒకచో చేరి నప్పుడు అన్యోన్యానురాగమును ప్రదర్శించుటకు మారుగ ప్రయో జనశూన్యముగ దైవభక్తిప్రదర్శనాది ప్రవర్తనయందు నిమగ్ను లైనట్లు చిత్రించుటయు నిట్టిదే వీరప్రధానమగు యుద్ధఘట్ట మున నాయకుడు, ప్రయోజనశూన్యముగ ప్రేయసీవిరహబాధావాదు లకు లోనైనట్లు చిత్రించుటయు నిట్లే రసభంగహేతువు మరియు భావమును అతిగా పోషించుటగూడ రసభంగహేతువే హృద యము ఉద్విగ్నమైయున్నపుడు రసానుభవముండదు భౌతికవస్తు విషయకమగు అనుభవముకూడ ఒక అవధికి లోనైయున్నపుడే యది సాధ్యమగును మితిమీరి అనవమును గ్రోలుటచే స్మృతితప్పి అనుభవము సిద్ధింపనట్లు, భావమును అవధికిమీరి పోషించుటవలన హృదయము ఉద్వేగమునకులోనై రసానుభవమునకు అనర్హము కాగలదు కనుక భావమును పోషించుటలోకూడ సంయమన మావశ్యకము మరియు భావము నెంతవరకు వాచ్యముచేయవలెనో అను విషయముకూడ ముఖ్యముగా గమనింపదగినది అందు ముఖ్యముగ శృంగారరసపోషణమునందు ఈవిషయమై మిక్కిలి జాగ్రత వహింపవలసియున్నది శృంగారప్రధానమగు శకుంతలా దుష్యంతుల ప్రథమసంయోగమున నాయకునిచే

"కిం శీతలైః క్లమవినోదిభిరార్ద్రవాతాం
సంచారయామి నళినీదళ తాళవృన్తైః
అంకే నిధాయ కరభోరు యథా సుఖం తే
సంవాహయామి చరణావుత పద్మతామ్రౌ "

అని ఎంత లలితముగ నాగరక విధానమున కవి పలికించియున్నాడో గమనించునది నాయకుని హృదయము రతిభావపూరితమై ఆవేశ మునకు లోనై నసందర్భమునగూడ కవి యతనిచే—

"అపరిక్షత కోమలస్య యావత్
కుసుమస్యేవ నవస్య షట్పదేన
అధరస్య పిపాసతా మయా తే
సదయం సుందరి! గృహ్యతే రసోఽస్య "—

అని పలికించుటలో ఎంత ఔచిత్యమును ఎంత సంయమనమును పాటించినాడో సహృదయైకవేద్యము దుష్యంతుని యీ వాక్య మందలి "గృహ్యతే రసోఽస్య" అను ప్రయోగము విశేషార్థ స్ఫోరకము సమాగమమందలి పరస్పరావలోకన సల్లాపస్పర్శాది జన్యమగు హృదయతన్మయత్వమే రసస్థితి సాత్త్వికరసానందము నకు చిత్తము కామవికారరహితము శుద్ధసత్త్వస్వరూపము నై యుండవలెను విషయేచ్ఛాప్రవృత్తివలన సిద్ధించునది ఇంద్రియ సౌఖ్యమేగాని సాత్త్వికానందముకాదు విషయేచ్ఛాతృప్తి కలిగిన పిమ్మటనేర్పడు తద్వైముఖ్యమే అది యానందము కాదనుటకు తార్కా ణము శృంగారంసోత్పాదకమును కామతృప్తికిని సంబంధములేదు సాత్త్వికమగు చిత్తవికాసమునకు సంబంధించినది రసవిషయము కావున రసమును పోషించుటలో, నందును ముఖ్యముగ శృంగార మును చిత్రించుటలో కవిప్రతిభ వ్యక్తము కాగలదు

"కిమపి కిమపి మందం మందమాసక్తియోగా
దవిరళిత కపోలం జల్పతో రక్రమేణ
అశిథిల పరిరంభ వ్యాపృతైకైకదోష్ణో
రవిదితగతయామా రాత్రిరేవవ్యరంసీత్ "



కి స్మై ర

అను భవభూతి రచనకూడ సాత్త్వికశృంగారపోషణకు ఉత్కృష్టమగు నుదాహరణ

నయనశ్రవణేంద్రియముల సాహాయ్యమున హృదయమునకు వికాసమును కలిగించుటయే కర్తవ్యమనుట నాటకకర్త విస్మరింపదగని విషయము శ్రమ దుఃఖము, ప్రాపంచిక కష్టములు మున్నగువానిచే ఖిన్నములైన మనస్సులకు వినోదమును కల్పించుటకూడ నాటక ప్రధానప్రయోజనములలో నొకటియని గమనింపవలెను కావున ఇతివృత్తపోషణ భావపోషణాదు లెవ్వియును జుగుప్సావహములు కారాదు నాయికానాయకుల చిత్తవృత్తి ప్రదర్శనముచే సామాజికుని మనస్సునందు సుప్తమైయున్న భావములను వికసింపజేసి సామాజికునకు రసానుభవమును కలిగించుట ప్రధానమగు నాశయము ఇట్లు రసపోషణమే భారతీయ నాటకమునందు ప్రధానాంశమగుటచే ఇతివృత్తప్రవృత్తి పాశ్చాత్యనాటకములందు వలె ప్రాధాన్యము వహింపదు భారతీయ రూపకరచనయందలి ఈ దృక్పథము తెలియక భారతీయ నాటకములందు ఇతివృత్తప్రవృత్తి కుంటుపడినదని విమర్శించుట జరుగుచున్నది పాశ్చాత్యనాటకములందు నాయక పాత్రల చిత్తవృత్తుల ప్రదర్శనమునకు ప్రాధాన్యమేర్పడిన సన్నివేశములలో ఇతివృత్తప్రవృత్తి స్తంభించుట కానవగును హామ్లెట్ హృదయమున జరుగు సంఘర్షణను కవి చిత్రించు ఘట్టములలో ఇతివృత్తము ముందునకు సాగక స్తంభించుట ప్రసిద్ధమే. అయినను ఆ ఘట్టములు విమర్శకులచే ఉత్తమములుగ పరిగణింపబడుచునేయున్నవి కావున కవి యుద్దేశమునుబట్టి రచనావిధానము ఏర్పడుచున్నదనుట గమనింపవలెను రంగముపై ప్రదర్శితమగు నాయికానాయకవిషయక రసస్థితి యాథాతథమున సామాజికుడు తత్ప్రదర్శితమగు రసస్థితిని అనుభవించి ఆనందించుట భారతీయ నాటకముల యుద్దేశము సామాజికు డిందు నాయకావస్థతో తన్మయీభావమును చెందుచున్నాడు అతనికి సిద్ధించునది రసానుభూతి పాశ్చాత్య నాటకములలో సామాజికుడు నాయకుని యవస్థతో తాదాత్మ్యమును చెందుటలేదు నాయికానాయకుల జీవితావస్థలను తత్ప్రవృత్తిని రంగముపై చూచి సామాజికుడు చిత్తవికాసమును పొందగలుగుచున్నాడు నాయకునియందు ప్రదర్శితమైన స్థాయీభావమును అంతరంగానురూపమున భారతీయ సామాజికుడు పర్యవసింపజేసికొనుచున్నాడు పాశ్చాత్య సామాజికుడు ప్రదర్శితమైన నాయికానాయక జీవితమును బాహ్యమైనదిగనే పరిగణించి ఆయా సన్నివేశములతో సానుభూతిని ప్రదర్శించి రసము నాస్వాదింపగలుగుచున్నాడు ఈ వైవిధ్యమునుబట్టియే భారతీయ నాటకకర్తకు రసపోషణ ప్రధానాశయమగుచుండ పాశ్చాత్య నాటకకర్తకు ఇతివృత్తప్రవృత్తి ప్రధానమగుచున్నది

రూపకరచనయందు ప్రధానమగు రసమును పోషించుటలో కవి అనుసరింపదగిన విధానము నాట్యశాస్త్రముచే వివరింపబడినది కవికి నాట్యశాస్త్రము కావ్యరచనయందు మార్గమును సూచించుచున్నదేగాని స్మృతిగ్రంథములవలె ఆదేశించుచుండుటలేదు ఇతివృత్తమున కైక్యమును వివిధాంగములకు సామరస్యమును గూర్చి స్థాయీభావమును రసముగ పరిణమించునట్లు రచించుటయే ముఖ్యము, అట్లొనర్చుటలో కవికి స్వాతంత్ర్య మెంతయో గలదు అదివరకు ప్రచారములోనుండిన రూపకములన్నిటిని పరిశీలించి వ్యాకరింపగా వాని రచనయందు గోచరించిన శిల్పవిషయములే నాట్యశాస్త్రమున సూత్రములుగ వివరింపబడినవి కనుక ప్రతినాటకకర్తయు వీనిని నియమములుగ పాటించి వానికి దాసుడై ప్రవర్తింపవలెనని ఎందును చెప్పియుండలేదు నాట్యాలంకార వ్యాకరణాదిశాస్త్రము లన్నియు పూర్వవాఙ్మయభాగములకు వివరణగ్రంథములేగాని భావిరచయితలకు విధిసూత్రగ్రంథములుకావు పూర్వరచయితల అనుభవమునంతను వ్యాకరించి భావిరచయితలకు మార్గదర్శకమగునట్లుగ వివరించుటయే యీ గ్రంథముల యుద్దేశము నాట్యశాస్త్రమనునది పూర్వనాటకకర్తలవలంబించిన రచనావిధానమును వారి ఆశయములను రసపోషణయందు వారనుసరించిన ప్రక్రియను వారు చూపిన శిల్పమును వివరించుచున్నది

ప్రజలకు వినోదమును కల్పించుటమాత్రమేగాక సంఘమున నైతికవ్యవస్థను పోషించుటకూడ భారతీయరూపకముల యుద్దేశము సాంఘికాభివృద్ధికి వ్యక్తిస్వాతంత్ర్యరక్షణకు పురుషార్థసాధనకు, నైతికప్రమాణముల రక్షణ అవసరమని మన ప్రాచీనుల భావము ఈ కారణముననే మనవారు విశ్వశ్రేయము సాహిత్యప్రయోజనములలో నొకటిగా పేర్కొనియున్నారు అట్లే రూపకరచనయందు కూడ పురుషార్థములగు ధర్మార్థకామమోక్షములలో నేదేయొకటియైనను ప్రయోజనముకావలెనని ఆదేశించినారు మానవప్రయత్నములన్నిటిని స్థూలముగ ఈ నాల్గువర్గములలో నిముడ్పవచ్చును వీనిని సాధించుటలో నాయకుడు అనుభవించు సుఖదుఃఖాదులను, అతడు ప్రదర్శించు మనోదార్ఢ్య విశృంఖలతాసాహసాదులను, అతడవలంబించు ధర్మపథమును తుదకు అతడొందు ఫలమును, ప్రదర్శించుటవలన తదనుగుణములగు ప్రవృత్తిగల సామాజికులు నాయకప్రవృత్తి ననుకరించుటకు ప్రోత్సహింపబడుదురని ప్రాచీనుల యభిప్రాయము ఇట్లు ఉన్నతాదర్శమును సామాజికుల యెదుట నిడుట వీరి యుద్దేశమైనది దానితో నాయికానాయకులును ఇతివృత్తమునుకూడ ఉదాత్తములే కావలసివచ్చినవి నాయకుడు పురుషార్థసాధనకై చేయు ప్రయత్నము ఇతివృత్తమగుచున్నది ఈ యితివృత్తప్రవృత్తియే Action అని వ్యవహరింతురు

జనసామాన్యమునకు వినోదమునుకల్పించుట నాటకరచనయందు నొక యుద్దేశమేయైనను అంతకంటెను ఉత్తమమగు ఆశయముకూడ నొకటి కలదు సంఘమున నైతికవ్యవస్థను రక్షించుట,

దానికి ఉదాత్తస్థితిని కల్పించును అనునవి కూడ ముఖ్యములగు నాశయములు వ్యక్తిజీవితమును స్వాతంత్ర్యమును వ్యక్తికి సంఘమునగల ఆర్థికాద్యధికారములను రక్షించుటకును ధర్మార్థాది పురుషార్థముల సాధన సుగమమొనర్చుటకును నైతికవ్యవస్థ అత్యంతావశ్యకము కావున భారతీయులు సాహిత్యమూలమున అందును ముఖ్యముగ నాటకముల సాహాయ్యమున నైతికవ్యవస్థను పోషింప దలచుకొన్నారు పురుషార్థములను సాధించుటలో ధీరులగు మహావ్యక్తులు చూపిన ధైర్యసాహసాదులను త్యాగమును వారు పాటించిన నైతికసూత్రములను ఇతివృత్తములుగ నొనర్చి ప్రజాసామాన్యమునకు ఉదాత్తజీవితమునం దుత్సాహమును కల్గించుట నాటకకర్తల ఆదర్శమైనది ఉత్తమ పురుషార్థమును సాధించుటలో ఉత్తమవ్యక్తి జీవితమునకలిగిన సంఘర్షణము ఆకర్షణీయమగునట్లు రసవత్తరముగ నాటకమున పోషించి ఉన్నతభావోపేతులగు సామాజికులకు ఉద్బోధనుకలిగించుట వీరి ఆశయము కనుక ఇతివృత్తమున సాధింపవలసిన ప్రయోజనమేది? దానిని సాధించువ్యక్తి ఎట్టివాడై యుండవలయును? అను ప్రశ్నలు నాటకరచనయందు ప్రథమవిషయములగుచున్నవి అనగా ప్రయోజనమును నాయకుని నుద్దేశించి ఇతివృత్తవిభాగము గావింపవలసియున్నది ఇతివృత్తప్రయోజనమును సాధించుటకు తగిన నాయకుడు నిర్ణయమైనంతనే రచయిత దృష్టియంతయు నాయకపాత్రపోషణయందు కేంద్రీకరించుచున్నది దీనినిబట్టి ధర్మార్థాది పురుషార్థములలో నొకదానిని సాధించునట్టి నాయకుని చరిత్ర ప్రధానేతివృత్తముగ నేర్పడుచున్నది నాయకుని ప్రయత్నమువననే తప్ప ప్రయోజనసిద్ధి కలుగదు కనుక నాయకుని ప్రయత్నము ఇతివృత్తమున ప్రధానవిషయము అనగా కథాప్రవృత్తి ( Action ) ఇతివృత్తపోషణమున ముఖ్యభాగముగ నేర్పడుచున్నది ఇట్టి కథాప్రవృత్తిని నాటకమునం దనుసరింపవలసిన విధానమెట్టిది?

కథాప్రవృత్తి ప్రదర్శనము స్థాయీభావమున కనుగుణమై యుండక తప్పదు భారతీయనాటకకర్తల ఆశయము ననుసరించి రసోత్పత్తి లక్ష్యమగుటచే తన్మూలమగు స్థాయీభావమునకు కథాప్రవృత్తి అనుగుణమై యుండవలెను కావున స్థాయీభావమునకు వికాసమును పోషణను కలిగించుటకు ఎంతమాత్రము కథాప్రవృత్తి యవసరమగునో అంతమాత్రమే పోషింపవలసియుండును అయినను కథైక్యమునకు భంగము రాకుండుటకై భావరసపోషణలకు అనుకూలింపని కథావిషయములను గూడ విసర్జింప వీలులేదు అట్టి వానిని రంగమున ప్రదర్శింపకున్నను వేరువిధమున సూచించిననే తప్ప సమగ్రేతివృత్తమునకు భంగమువాటిల్లును ఇట్లు ఇతివృత్తము ప్రదర్శనీయయోగ్యము సూచ్యము అని రెండువిధములగుచున్నది దీనినే దృశ్యము సూచ్యము నవియందురు సరసమగు దృశ్యవస్తువును అంకములుగ విభజించి నీరసమగు సూచ్యవస్తువును అంకమునకును అంకమునకును మధ్య పాత్రలసంభాషణల మూలమున పోషింతురు విష్కంభక ప్రవేశక చూళికా అంకాస్య అంకావతారము లనునవి సూచ్యవస్తుపోషణమున అవలంబించు ముఖ్యవిధానములు ప్రయాణము యుద్ధము మజ్జనభోజన చుంబనాదివిషయములు సూచ్యములు సాత్త్వికుడగు సామాజికుని చిత్తమున క్షోభను జుగుప్సను కలిగించు విషయములను ప్రదర్శింపకుండుటకై భారతీయనాటకకర్త మిక్కిలి జాగ్రతవహించును మరియు నాటకరంగమునకును రంగపరికరములకును గల అవధులను బట్టి కొన్ని కథావిషయములు ప్రదర్శనసాధ్యములుకావు అట్లే మరికొన్ని విషయములను వాస్తవికతకు సన్నిహితమగునట్లు ప్రదర్శించుటకును సాధ్యముకాదు (వధ, యుద్ధము విమానయానము మొ॥) కనుక అట్టి విషయములను సంభాషణలద్వారా సూచింపవలసినదేగాని ప్రదర్శింపవీలులేదు

మరియు ప్రతిఅంకమునందును పోషితమగు ఇతివృత్త విషయమునకూడ దేశకాలముల కొక అవధి యేర్పడుచున్నది అనగా దేశకాలముల ఐక్యము ప్రతియంకమునను సిద్ధింపవలెననుట ముఖ్యము దీనినిబట్టియే అంకమున ప్రదర్శితమగు కథాప్రవృత్తియు విషయములును ఐదుముహూర్తముల కాలములో జరిగినట్టివై యుండవలెనని ఆదేశించినారు అట్టి కథాభాగము మాత్రమే నటులు అవచ్ఛిన్నముగ నటించుటకును, సామాజికులు ఇతరాంతరాయములకు లోనుగాక విసుగుచెందక అనుభవించుటకును వీలగుచున్నది

"అంకస్య ప్రయోగకాల పరిమాణమియదితి
దర్శయతి ఏకదివస ప్రవృత్తమితి—
ఏకదివసేనేతి ముహూర్తపంచకేనైవ"

అనగా జీవితమున సాధారణముగ ఒక దివసమునందుగాని అంతకంటె తక్కువకాలముననగాని జరుగగల విషయముమాత్రమే ఒక అంకమున ప్రదర్శించుట తగునని అర్థము ఈ విషయపరిమితి వాస్తవిక జీవితమునకు సన్నిహితమును స్వాభావికమును నగుచున్నది దీనినిబట్టి అంకవిభజన ప్రదర్శనమున కనుకూలించు విధానమని విదితమగుచున్నది ఇంతకంటెను ముఖ్యమగు ఇతివృత్తవిభజనము కలదు కథాప్రవృత్తినంతను అయిదు భాగములుగ విభజించుకొని పోషించుట ఇట్టి విభాగము లివిని కార్యావస్థలందురు ఆరంభము ప్రయత్నము ప్రాప్త్యాశ, నియతాప్తి, ఫలాగమము అను నీ యవస్థలు కథాప్రవృత్తియందలి అయిదు ప్రధానములగు దశలను పోషించుచున్నవి ఇందలి ప్రతియవస్థను వేరువేరంకములయందు పోషింపవలెను ఒక దశకు సంబంధించిన ఇతివృత్తము ఒక అంకమున ఇముడకపోయినచో దానిని రెండంకములలో పోషించుకొనుటకు వీలున్నది అంతకుమించి

అంకములను కల్పించుటవలన ఇతివృత్తము వలనకునై, భావతీవ్రతకు భంగమువాటిల్లకలదు దీనివలన రసపోషణకు భంగము కలుగగలదు కావున ఏ కార్యావస్థముగాని రెండంకములకు దాటి విస్తరింపజేయకుండుట శ్రేయము ఇట్లు ఐదు కార్యావస్థలను పోషించుటలో ఇతివృత్త మెంత విస్తృతమైనదైనను పది యంకములను దాటదు ఐదవస్థలను వేర్వేరుగ పోషించుటకు కనీసము ఐదంకములైనను అవసరమగుటచే అయిదంకములు తప్పనిసరి యగుచున్నవి కావుననే "ఆ పంచాంక మాదశాంకము నాటకము" అను లక్షణ మేర్పడినది మూలకథయందు ఆయా ఇతివృత్తభాగములు జరిగినకాలము ఇంతకంటె విస్తృతమైనను వానిని కవి అంకప్రదర్శనానుగుణముగ మార్చవలసియుండును ఇట్లు కాలము విషయమున ఐక్యము నాటకకర్తలచే పాటింపబడియున్నది అదే విధమున దేశమును గూర్చిన ఐక్యము కూడ అంకములయందు పాటింపబడియున్నది ఒక అంకమున పోషితమగు నితివృత్తము బహుదూరములగు భిన్నప్రదేశములందు జరిగినట్లు వర్ణించుట కూడదు ఆ యితివృత్తము జరుగుటకు పట్టుకాలములో ఆ ప్రదేశములు సులభముగ చేరదగినవియై యుండవలెను దూరప్రదేశములలో ఇతివృత్తము జరిగినట్లు పోషింపవలసివచ్చినచో ఆ భాగము వేరువేరంకములలో ప్రదర్శింపవలసియుండును నాయకుడు దివ్యుడై విమానాది సహాయములు కలవాడగుచో నొకప్పుడు దూరదేశములలో కథ జరిగినట్లు చూపి ఒకేయంకమున వర్ణింపవచ్చును

"యః కశ్చిత్ కార్యవశాత్ గచ్ఛతి పురుషః ప్రకృష్ట మధ్వానమ్।
తత్రాప్యంకచ్ఛేదః కర్తవ్యః పూర్వవత్ తజ్జ్ఞైః॥
డిమాదినాయకస్య తు దివ్యస్య ఆకాశయానకాదినా సర్వంయుజ్యతే"

కాలవిషయమునగూడ నిట్లే వివిధాంకములయందు పోషితములైన కథాభాగములకు మధ్య జరిగిన కాలమును విష్కంభకాదులచే సూచింపవలెనని తెల్పుచు అందు కూడ ఆకాలము ఒక సంవత్సరమునకు మించరాదనియు నిర్దేశించినారు

"అంకచ్ఛేదంకుర్యాత్ మాసకృతమ్ వర్షసంచితంవాపి
ఏతత్సర్వం కర్తవ్యమ్ వర్షాదూర్ధ్వం న తు కదాచిత్
దివసే అవసానం సమాప్తిర్యస్య తత్పరం కార్యం
యద్యంకే ప్రత్యక్షేణ ప్రదర్శయితుం న యుజ్యతే।
తదా అంకచ్ఛేదం కృత్వా ప్రవేశకై ర్దర్శయేయం
అదృష్టమప్యర్థం వ్యాది ప్రవేశయంతీతి॥"

పైవిధిబట్టి దేశకాలకథాప్రవృత్తులకు సంబంధించిన ఐక్యమును భారతీయనాటకకర్తలు బాగుగ పాటించినారని వ్యక్తమగుచున్నది ఈ విషయమున "కీత్" మున్నగు పాశ్చాత్యపండితులు గావించిన విమర్శ నిరవకాశము పొరపాటు అని చెప్పకతప్పదు ప్రధానేతివృత్తమునకును స్థాయీభావమునకును విరుద్ధములగు సన్నివేశములు గాని విషయములుగాని స్పృశింపగూడదనుట భారతీయ లక్షణమందలి ముఖ్యసూత్రము కనుక కథైక్యము ప్రాధాన్యము వహించుచున్నది

భారతీయనాటకములలో కథాప్రవృత్తి కుంటుపడుచున్నదని మరియొక విమర్శ భారతీయ నాటకకర్తల ఆశయము తెలియకుండుటయే యీ విమర్శకు హేతువు నాయకుని హృదయమందలి స్థాయీభావమును పోషించుటకును తద్ద్వారా సహృదయుడగు సామాజికునియందు భావమును ఉద్బుద్ధము గావించుటకును కథాప్రవృత్తి ముఖ్యమగు సాధనమగుచున్నదే గాని అదియే ప్రధాన లక్ష్యము కాదు సంస్కృతనాటకములయందు కథాప్రవృత్తి స్థాయీభావమూలమున నేర్పడి నడచుచు సామాజికునియందు భావవికాసమునకు కారణమగుచుండుటచే నిందు ఆత్మాశ్రయపరాశ్రయ లక్షణములు రెండును చేరియున్నవి కావున కథాప్రవృత్తి సంస్కృతనాటకమునందు ఒక విశిష్టమార్గమున నడచుచున్నది ఈవిషయమున భారతీయులకును పాశ్చాత్యులకును గల ముఖ్యభేదమును గుర్తింపవలసియున్నది నాటకప్రదర్శనమువలన సామాజికునియందు కలుగు భావములు సామాజికునకును కథానాయకునకు గల సంబంధముపై ఆధారపడుచున్నవి నాయకుడు పురాణపురుషుడైనను చారిత్రకపురుషుడైనను లేదా సంఘమునందలి ఉదాత్తపురుషుడే యైనను సామాజికునికంటె భిన్నుడే అను పరిజ్ఞానమున్నప్పుడు నాయకునిభావములతో సామాజికునకు తాదాత్మ్య మేర్పడదు నాయకుని భావములతోడను స్థితిగతులతోడను సామాజికునకు సానుభూతి యేర్పడి తద్ద్వారా చిత్తము ఆర్ద్రమగుచున్నది పాశ్చాత్యనాటకములయందు సామాజికుడు నాయకుని భావముతో సానుభూతిని చూపగల సాక్షిమాత్రు డగుచున్నాడేకాని వానితో తాదాత్మ్యమును పొందడు "హామ్లెట్"నుగాని "జూలియస్ సీజరు"నుగాని రంగమున చూచినప్పుడు సామాజికునకు నాయకభావములతో సాధారణీకరణత్వ మేర్పడుటలేదు కావున తాను ప్రేక్షకమాత్రుడై నాయకావస్థలను దర్శించి తత్తదవస్థానుగుణమగు సానుభూతిని ప్రదర్శించుచు ఆనందించుచున్నాడు అనగా తనకు సంబంధించని ఇతరుని జీవితేతివృత్తమును దర్శించునట్టివాడు పాశ్చాత్యనాటకమునందలి సామాజికుడు కావున సామాజికునియందు కలుగు భావములు సాంఘికసంబంధములైనవియేగాని వ్యక్తిసంబంధములైనవి కావు భావము వ్యక్తిగతమైనప్పుడే ఆవేశమునకు ఉద్వేగమునకు అవకాశమున్నది అది లేనంతవరకు రసోత్పత్తి కవకాశములేదు సంస్కృతనాటకప్రదర్శనమున సామాజికుడు నాయకునిభావముతో తాదాత్మ్యమును పొంది తన్ను, బాహ్యపరిసరములను నాయకుని కూడ విస్మరించి మానవత్వసంబంధమగు తదవస్థయందు లీనుడై

అనందింపగలుగుచున్నారు. అనగా రసస్థితియందు మానవత్వ సంబంధములగు రతి మున్నగు భావములకును తదాలంబములగు స్త్రీపురుషస్వభావములకును మాత్రమే సామాజికుని మనస్సునందు అవకాశమేర్పడి తక్కినవన్నియు తాత్కాలికముగ విస్మృతము లగుచున్నవి. విశుద్ధమగు దర్పణమునందు బింబము భాసించునట్లు శోభనమగు సామాజికుని హృదయమున నాయికానాయకగత భావము సాధారణ స్త్రీపురుష సంబంధభావముగ అనుభూతమై రసోత్పత్తిని కలిగించుచున్నది. కావున భారతీయసామాజికుడు నాయకభావావేగాదులకులోనై తన్మయతను చెందుచున్నాడు. హృదయము తన్మయమైయున్నపుడు ఇంద్రియప్రవృత్తి కవకాశమే తక్కువ. హృదయము భావోద్వేగాదులకు లోనైయున్నపుడు బాహ్యేంద్రియప్రవృత్తికి వలయు ఆంతరశక్తి లోపించుచున్నది. ఆకారణముచే బాహ్యప్రవృత్తి మందమగుచున్నది. కావుననే స్థాయీభావపోషణమే ప్రధానవిషయముగాగల భారతీయనాటకమున కథాగమనమునకు ప్రాధాన్యము తక్కువ. నాయికానాయకుల యందు కలుగు భావానుభావాదులు వ్యభిచారిభావములు మున్నగునవి రసపోషణ కనుకూలించినవగుటచే ప్రాధాన్యము వహించుచున్నవి. ఇతర సన్నివేశములన్నియు వీనికి పోషకములేగాని స్వతంత్రముగ ప్రయోజనకారులు కావు. కావున కథాప్రవృత్తి యనునది అప్రధానమగుచున్నది. పాశ్చాత్య నాటకప్రదర్శనమున సామాజికుని దృష్టి పరాశ్రయమైనదియేకాని ఆత్మాశ్రయమైనది కాదు. నాయకుని జీవితము, అతని సంఘర్షణ, అతని కష్టసుఖములు సామాజికునాకర్షించు విషయములు. రంగముపై విని ప్రదర్శింపబడుచుండునంతవరకు సామాజికుని దృష్టి రంగముపై కేంద్రీకరింపబడియుండును. నాయకుని భావాదులతో సామాజికుని హృదయమునకు తాదాత్మ్యము లేనికారణమున సామాజికుని ఆనందము ఆత్మాశ్రయమైనదికాదు. అతనికి గలుగు నానందము పరాశ్రయమైనదగుటచే రంగమున కథాప్రవృత్తి ఎడతెగక జరుగుచునేయుండవలయును. ఈకారణమును బట్టియే పాశ్చాత్యనాటకములలో కథాగమనమునకు ప్రాధాన్య మేర్పడినది. సాధారణజీవితపరిసరముల నుండి నాటకసన్నివేశమునకు సామాజికుని గొంపోయి తన్నాటక సన్నివేశమందలి నాయికానాయకుల జీవితసంఘటనలను అతడు ప్రత్యక్షముగ దర్శించునట్లు చేయుట పాశ్చాత్యనాటకములందలి పద్ధతి. ఇందు సామాజికుడు నాయికనాయకావస్థను దర్శించి సానుభూతిని ప్రదర్శించు ప్రత్యేకవ్యక్తి యగుచున్నాడే కాని వారితో నభిన్నుడగు వ్యక్తి కాడు. నాయికానాయకుల గుణశీలాదులు సామాన్యమానవసంఘమునెడ వారికిగల దయ, సానుభూతి ధర్మన్యాయముల రక్షణకై వారొనర్పు త్యాగము తత్ప్రియత్నమున వారనుభవించు కష్టములు, ఇత్యాదులు కారణములుగ సామాజికునకు వారియందు సానుభూతి అధికముగ నేర్పడుచున్నది. ఉదాత్త జీవితసందర్శనముచేతను, ఉదాత్తభావానుభూతిచేతను సామాజికుని హృదయము శోభితమై సంస్కృతి నందుచున్నది. ఉత్కృష్టజీవిత భావములతోడను మానవజీవితముతోడను సామరస్యమేర్పడి ఆనందము సిద్ధించుచున్నది. నాయికానాయక జీవితప్రదర్శనమే సామాజిక హృదయమును ఆకర్షించుటకు హేతువగుచున్నది. అట్లాకర్షింపబడిన సామాజికుని చిత్తమునకు ఏకాగ్రత సిద్ధించుటకు కథాప్రవృత్తి తప్పనిసరి యగుచున్నది. సన్నివేశపరంపరలతో కూడిన ఇతివృత్తము రంగముపై వేగముగ నడచుచున్నంతకాలము సామాజికునిదృష్టి నాయకజీవితేతివృత్తముపై కేంద్రీకరించుటకు వీలున్నది. కావున కథాప్రవృత్తి నిరంతరాయముగ జరుగుచుండవలెను. లేనిచో సామాజికుని చిత్తమునకు ఉపాధి లేకపోవుటయు, నాకారణముచే వతని చిత్తము వాస్తవికపరిసరములకు మరలుటయు జరుగును. ఇట్లు నాటకసన్నివేశమునుండి చిత్తము భ్రంశమగుటయు ఏకాగ్రతకు భంగము కలుగుటయు కారణములుగ చిత్తవికాసమున కవకాశమే లేకపోవుచున్నది. సామాజికుని చిత్తము బాహ్యవస్తువుపై కేంద్రీకరించి తదుపాధివశమున ఆనందసిద్ధిని పొందుచుండుటచే పాశ్చాత్యనాటకప్రదర్శనమున కథాప్రవృత్తి ప్రధానమగుచున్నది. సామాజికుని చిత్తము భౌతికమగు బాహ్యవస్తువుపై కాక భావమయమగు అంతరంగముపై కేంద్రీకరించి భావనిత్యము ఉపాధిగా ఆనందసిద్ధిని బొందు సందర్భములో బాహ్యవస్తువు అప్రధానముకాగలదు. భారతీయనాటకమున రంగముపై ప్రదర్శింపబడు నాయికానాయక జీవితము సామాజికుని విషయమున నిమిత్తమాత్రమే యగుచున్నది. నాటకీయసన్నివేశము వాచికాంగికాద్యభినయము రంగపరికరములు ఇత్యాదుల సాహాయ్యమున సామాజికుని హృదయమున భావము వికాసము పొందుటయు ద్రావము ఉద్వేగమును జెందుటయు జరుగుచున్నది. ఆపై సామాజికుడు చిత్తమును రంగముపైనుండి మరలించి అంతరంగజీవితమున ప్రవర్తింపచేయుచున్నాడు. రంగముపై కేంద్రీకరింపబడియున్న నయనశ్రవణేంద్రియములద్వారా కలుగు ననుభూతి చిత్తమును ఉత్తేజనమును గల్పించి భావనావీధులందు సోల్లాసముగ ప్రవర్తింపచేయుచున్నది. బాహ్యేంద్రియముల ద్వారా కలిగిన అనుభవము ఈవిధమున సామాజికుని చిత్తప్రవృత్తికి నిమిత్తమగుచున్నది. సామాజికుడు భావనా ప్రపంచమున లీనుడై తన్నును తన పరిసరములను నాయకజీవితమును గూడ అధిగమించి, కేవలము భావమయమగు జీవితముతో తాదాత్మ్యమును పొందుచున్నాడు. అట్టి మనోజీవితమున అతడు గాంచునది సర్వమానవసాధారణమగు ప్రకృతిధర్మమే కాని వ్యక్తిగతధర్మము కాదు. అభిజ్ఞానశాకుంతల చతుర్థాంక కథాసందర్శనముచే సామాజికునకు కలుగు భావము శకుంతలాకణ్వగతమైనది కాదు. తాను పెంచిన కూతును అత్తవారింటికి పంపు సందర్భమున తల్లిదండ్రులను బిడ్డయు, సర్వసాధారణముగ ననుభవించు చిత్త

స్థితి సామాజికునిచే ననుభూయమానమగుచున్నది శకుంతలా కణ్వుల వృత్తాంతము నిమిత్తముగ సామాజికునిచిత్తము భావనయమై భావనాప్రవృత్తికి లోనై సాధారణమానవధర్మము దర్శించి దానితో తాదాత్మ్యమును పొందగలుగుచున్నది అదియే సాత్త్వికమగు రసానుభవస్థితి తనకంటెను బాహ్యమగు వస్తువు ఆలంబనముగ సాధారణమానవధర్మముతో మనచిత్తమున కేర్పడు తాదాత్మ్యస్థితిని సాధారణీకరణమను పేర అభినవగుప్తాదులు వ్యవహరించినారు ఇట్లు సాధారణీకరణ మేర్పడుట రసానందానుభూతికి హేతువు అట్టి రసానందానుభవమును సామాజికునకు కలిగించుటయే నాటకకర్త ప్రధానాశయము పైన వివరించిన విధమున ఇట్టి రసానుభవమునకు సామాజికుని చిత్తప్రవృత్తియే ముఖ్యమని వ్యక్తము సామాజికునియందు భావమును ఉద్బుద్ధము చేసి కొంతమునకు వికసింపచేయుటకు ప్రదర్శనము ఆలంబనమగుచున్నది సాధారణీకరణమునకును దానినాశ్రయించిన రసానుభవమునకును సామాజికుని మనోవ్యాపారమే ప్రధానమగు విషయము కావున రంగముపై జరుగు కథాప్రవృత్తి భారతీయనాటకకర్తకు ఒక సాధనముమాత్రమే కాని పరమార్థము కాదు రసోత్పాదన యను పరమార్థమును సాధించుటకే కథాప్రవృత్తి సాధనము మాత్రమే సామాజికుని హృదయమున నుత్పన్నములగు భావపరంపరలు అనుభావాదులు అతడు లోనగు సాత్త్వికాదులు మున్నగునవి మిక్కిలి ప్రధానములు అనగా భారతీయనాటకమున సామాజికుని మనోవ్యాపారమునకున్న ప్రాధాన్యము సాధనమాత్రమగు కథాప్రవృత్తికి లేదు ఈతత్త్వమును బట్టియే సంస్కృతనాటకములలో కథాప్రవృత్తికి ప్రధానస్థాన మేర్పడలేదు ఈవిషయమును గుర్తింపక పాశ్చాత్యనాటకముతో సంస్కృతనాటకములను పోల్చి తారతమ్యనిరూపణ గావింపబూనుట విమర్శ కాదు

సామాజికునిహృదయమును భావమయమొనర్చి అత్యుదాత్తమగు రసస్థితికి గొంపోయి తదనుభూతిజన్యమగు ఆనందమును సామాజికునకు గల్గించుట భారతీయనాటకకర్తల ఆశయము వీరి నాటకరచనావిధానమంతయు ఈ యుద్దేశము ఫలించుటకు అనుగుణముగ నేర్పడినది ఇతివృత్తవైశిష్ట్యము రసపోషణానుకూలమగు ఇతివృత్తవిభాగము వివిధకథాంగములకును ప్రధానప్రయోజనముతో ఐక్యముకల్గునట్లు కూర్చుట స్థాయీభావము క్రమవికాసమునుజెంది రసపర్యవసితమగుటకు అనుగుణములగు సన్నివేశములను కల్పించుట ప్రధానప్రయోజనమునకు భంగకరములు విరుద్ధములు నగు కథాంశములను ప్రయోజనానుగుణముగ మార్చుట పాత్రల గుణశీలప్రవృత్త్యాదులను ప్రధానప్రయోజనసిద్ధికి దోహదమొనర్చునట్లు చిత్రించుట మున్నగునవి రచనాశిల్పమునకు చెందిన విశేషములు

రూపకభేదములలో నాటకము సమగ్రము విశిష్టభావోపేతమునైనది మానవజీవిత ప్రవృత్తియందు ప్రధాన ప్రేరకశక్తులైనవి శృంగారము వీరము నగుటచే వీనినే నాటకములయందు ప్రధాన రసములుగ పోషించినారు ధర్మబద్ధమగు రతి మానవజీవితమున ఆనందమును సిద్ధింపజేయుటలో ప్రబలమైన హేతువు అభావమే తదనుగుణమగు పరిసరములయందు పోషితమై సంపూర్ణవికాసమును బొంది పరిణతస్థితియందు శృంగారరసముగ నాస్వాదింపబడుచున్నది మానవప్రవృత్తిలో మిక్కుటమగు భాగమునకు చాలవరకు ఈ రతిభావమే ప్రబలమగు కారణము మానవ మనస్తత్త్వశాస్త్రజ్ఞుడగు ‘Freud,’ కూడ జీవితప్రవృత్తికంతకును రతిభావమే ఆధారమని నిరూపించినాడు కావున శృంగారరసము జీవితప్రతిబింబమగు నాటకరచనయందు ప్రాధాన్యము వహించుటలో నాశ్చర్యములేదు ఇక రెండవది వీరరసము ఉత్కృష్టమగు ఫలమును సాధించుటకై ఉత్సాహపడుట మానవజీవితమున ప్రధానమైన విషయము ఈయుత్సాహమే వీరరసముగ పరిణమించుచున్నది ఉత్తమధర్మమును విశిష్టప్రయోజనమును లోకకల్యాణమును సాధించుటకు ఉదాత్తుడగు వ్యక్తి ప్రదర్శించు నుత్సాహమే వీరముగ పర్యవసించుచున్నది సాధారణముగ మానవజీవితమంతయు శృంగారవీరముల పరిధిలో ఇముడ్చుటకు వీలగుచున్నది అదిగాక జీవితమున కుత్తేజమును రామణీయకమును గూర్చుటలో ఈ రెండు రసములకును గల శక్తి రౌద్రభీభత్సాది ఇతరరసములకు లేదు సాత్త్వికమగు నానందమును గూర్చుటలో వీరశృంగారములకున్న సామర్థ్యము ఇతర రసములకు లేదు మరియు రౌద్రభీభత్సాదులను హృదయక్షోభ జుగుప్స మున్నగు వానికుపాధులగుటచే సార్వత్రికముగ వీనిననుభవించుట సాధ్యముకాదు వాస్తవిక జీవితమునకూడ వీనిప్రసక్తి అప్రధానమే కావుననే నాటకములలో వీనిని అందందు క్వాచిత్కముగ పోషించినారేకాని ప్రధానములుగ చేయలేదు రతిభావము ప్రేయసీప్రేయసుల విషయమున ప్రణయముగను సంతానము విషయమున వాత్సల్యముగను గురుపిత్రాదులయెడ గౌరవముగను ఈశ్వరుని విషయమున భక్తిగను పరిణమించునని చెప్పవచ్చును ఉత్కృష్టప్రయోజనము నుద్దేశించిన ఉన్నతుడగు వ్యక్తియొక్క ఉత్సాహము ఫలింపనినాడు శోక మేర్పడి కరుణగా పర్యవసించుననియు కొందరి మనస్తత్త్వశాస్త్రజ్ఞుల యభిప్రాయము కావున శృంగారవీరములకు జీవితమునగల ప్రాధాన్యము విస్తృతమైనది దీనినిబట్టియే ఉదాత్తనాటకములన్నియు వీనినే ముఖ్యములుగ పోషించినవి మానవప్రయత్నములు ఎంతయుదాత్తములైనను ఎల్లప్పుడును ఫలించునని చెప్పజాలము మానవుని యుత్సాహప్రయత్నములు విఫలములగుట ప్రకృతిసిద్ధమగు విషయమే కావున శోకమునకు కూడ మనజీవితమున అధికార మేర్పడినది ఈ కారణమును బట్టియే ఉత్తరరామచరిత్రవంటి శోకభూయిష్ఠమగు రచ

సమగూడ మన మాస్వాదింపగలుగుచున్నాము అయినను మానవో త్సాహవైఫల్యమును తత్ఫలితమగు శోకమును, ప్రధానముగ నాటకములయందు పోషించి ప్రదర్శించుటవలన ప్రజలకు వినోదము కల్గుటకు మారుగ క్లేశము కల్గుట కెక్కువ అవకాశమున్నది జీవితమందలి కష్టములు దుఃఖములు మున్నగువానిచే ఆర్తులై యున్న సామాన్య జనసమూహమునకు వినోదము కల్పించుట కూడ నొక ప్రధాన ప్రయోజనముగ నుద్దేశించిన భారతీయనాటకకర్తలు కరుణరసప్రధానములగు నాటకముల నెక్కువగ ఆదరింపనివారైరి నాటకము జీవితమునకు సమగ్రప్రతిబింబమగుటయు జీవితమున రత్యుత్సాహములు ప్రధానభావములగుటయు కారణములుగ నాటకములలో శృంగారవీరములు ప్రధానరసములు కావలెనని నిర్దేశించినారు జీవితమునందు దయా అవస్థానన్నివేశములలో తాత్కాలికముగ మానవుడు హాస్య రౌద్ర భయానకాదుల ననుభవించినట్లే నాటకమున కూడ నివి ప్రధానరసమును పోషించునవియై అంగములు ఇతివృత్తానుగుణముగ నుపయుక్తములగుచున్నవి

వస్తువు భారతీయనాటకకర్తలు పురుషార్థములను నాటక ప్రయోజనముగ నేన్పుడుద్దేశించినారో అప్పుడే ఇతివృత్తము కూడ ఉదాత్తము కావలసివచ్చినది ధర్మమును ధర్మబద్ధమగు అర్థకామములను సాధింపబూనిన ఉత్తమపురుషుని ప్రయత్నమును తత్పరిణామమును ఇతివృత్తముగ నేర్పడినవి జన్మపరంపరను, కర్మసిద్ధాంతమును విశ్వసించిన భారతీయులు ఉదాత్తభావోపేతములగు కావ్యములను రచించుటలో ఇతివృత్తమును ఉన్నతవర్గములవారి జీవితములనుండి గైకొనుటలో ఆశ్చర్యములేదు ఇదికాక రసోత్పత్తికనుకూలించు స్థాయీభావము సామాజికునియం దుద్బుద్ధమగుటకు ఉదాత్త నాయికానాయకుల జీవితము ప్రయోజనకారి కాజాలదు మానవమనస్తత్త్వము కూడ ఇందుల కనుగుణముగనే యున్నది తనతో సాటియగు మానవుని జీవితప్రదర్శనమునందు సామాన్యముగ మానవు డాసక్తిని వహింపడు ఒకవిధమగు ఉదాసీనభావమును లేక విసువుభావమును వహించుట మానవప్రకృతి తనకంటెను ఉన్నతమగు జీవితముపై మానవునకున్న ఆసక్తి అమితమైనది అట్టి ఆసక్తి యున్నపుడే అతనిచిత్తము రంగముపై కేంద్రీకరించి ఏకాగ్రమగుటకును కథపట్ల రసానుభవమును పొందుటకును అవకాశమున్నది కావున రసోత్పత్తియే ప్రధానలక్ష్యముగ నెంచుకొన్న భారతీయులు ఉదాత్తనాయకేతివృత్తమునే నాటకములయందు వస్తువుగ నాదరించినారు ఈవిషయమును గుర్తింపక పాశ్చాత్యనాటకకర్తలకు సామాన్యజీవితమునందు విరసన భావమని విమర్శించుట తగదు మొదట నాటకరచనయే సామాన్య ప్రజల నుద్దేశించినది అనుట విస్మరింపరాదు గ్రీకునాటకములలో కూడ ఉదాత్తనాయకేతివృత్తమే వస్తువుగనైనది షేక్స్పియర్ నాటకములు గమనించినను ఈ విషయమే వ్యక్తముకాగలదు మానవత్వధర్మములు మనోవ్యాపారములు చిత్తవృత్తులు జీవితమందలి కష్టసుఖాదులు మున్నగువానినన్నిటిని ఉదాత్తులగువారి జీవితమునగూడ చూడగల్గుటచే సామాన్యులకు జీవితముతో సామరస్య మేర్పడుచున్నది భౌతికకష్టపరంపరల కారణముగ హృదయమున నేర్పడిన తీవ్రభావములు చాంచల్యము ఇత్యాదులు శాంతములై సాత్త్వికస్థితి కలుగుటకు వీలున్నది ఈ కారణములవలననే నాటకములలో వస్తువు ఉదాత్తముగ నుండవలెనని నిర్దేశించినారు నాటకవిషయమునమాత్రమే ఈ నిర్దేశము ప్రధానమై యున్నది ప్రకరణాదులలో ఇతివృత్తము సామాన్యజీవితమునకు సన్నిహితమై యుండుట గమనింపదగును

(సశేషము)

---


## కిన్నెర చందా వివరం

| | | |
|---|---|---|
| విడి కాపీ | 6 | అణాలు |
| అర్ధ సంవత్సరం చందా | 2 | రూపాయలు |
| సంవత్సరం చందా | 4 | రూపాయలు |

మేనేజరు కిన్నెర, 16 జోన్సు వీథి, మదరాసు-1

ఒక రష్యన్ కథ.

# కాపలా సైనికుడు


రచయిత

నికోలస్ లెస్కోవ్

అనువాదం:

వాసమూర్తి


## ౧

1839 వ సంవత్సరపు శీతాకాలంలో పీటర్స్‌బర్గ్ నగరంలో ఎపిఫనీ పండగ (క్రీస్తును ముగ్గురు బుద్ధిమంతులు దర్శించిన దినం) సమీపాన శీతోష్ణస్థితి ఒక్కమారుగా మారిపోయింది గాలి వెచ్చబడింది వసంత ఋతువు [illegible] ఉండేటట్లుగా ఉంది మంచు కరగడం మొదలుపెట్టింది పగటి వేళ ఇళ్ళచూరులనుంచి నీళ్లు కారసాగాయి నదుల్లోని గడ్డకట్టిన నీరంతా అడుగున నీటిమల్ల పైకి ఉబికింది నేవానదిలో చక్రవర్తిగారి శీతాకాలపు భవనానికి ఎదుటనే నీటిమడుగులు ఏర్పడ్డాయి వెచ్చటి పడమటిగాలి వీస్తూ అంతకంతకు తీవ్రమవుతోంది నది నీటిమట్టం పైకి పెరుగుతూ నగరానికి అపాయం తెచ్చేటట్లుంది హెచ్చరికలుగాను తుపాకులు పేల్చబడ్డాయి

రాజభవనంలో నికోలై ఇవనోవిచ్ మిల్లర్ అనే యువక ఆఫీసరు నాయకత్వం కింద ఇజ్మాయిలోవ్‌స్కీ రెజిమెంటులోని ఒకదళం కాపలాకాస్తోంది మిల్లర్ చదువూ తెలివితేటల్లో మెప్పుబడసినవాడు ఆ సమాజంలో ఉన్నతవర్గాలకు చెందినవాడు (కొంతకాలం పిమ్మట సేనాధిపతి అయ్యాడు కూడా) కనికరస్వభావం కలవాడు పైఅధికార్లు ఇది మొదట్లోనే గమనించారు ఈ స్వభావం అతని భవిష్యత్తును పాడుచేయవచ్చునని కూడా భావించారు

అయినా ఆఫీసరు మిల్లర్ చాలా సమర్థుడూ, విశ్వసనీయుడూనూ పైగా ఆ రోజుల్లో రాజభవనంలో కాపలాకాయడం అపాయభరిత మేమీకాదు శాంతిస్థిరత్వాలు నెలకొన్న రోజులవి భవన రక్షకదళం చేయవలసినదల్లా కాపలావారు ఎవరి డ్యూటీలు వారు సరిగా చేయడమే కాని దురదృష్టవశాత్తు భవనరక్షకదళానికి మిల్లర్ కమాండింగ్ ఆఫీసరుగాఉన్న కాలంలోనే చాలా అసామాన్యమైనదీ ఆందోళన కలిగించేదీ సంఘటన జరిగింది

## ౨

రక్షకదళానికి మొదట్లో అంతా బాగానే నడిచింది ఎవరు చేయవలసిన డ్యూటీలు వారికి ఒప్పగించబడ్డాయి కాపలావారు వాళ్లవాళ్ల స్థానాల్లో ఏర్పాటుచేయబడ్డారు అంతా సక్రమంగాఉంది చక్రవర్తి నికోలస్ పావ్‌లోవిచ్ మంచి ఆరోగ్యంలో ఉన్నారు సాయంత్రం షికారుకుపోయి తిరిగివచ్చి శయనమందిరానికి చేరారు భవనమంతా నిద్రపోయినట్లుంది ప్రశాంతమైన రాత్రి అది రక్షకదళపు గదిలో అంతా నిశ్శబ్దంగా ఉంది కెప్టెన్ మిల్లర్ రెండు సూదిమొనలతో తన తెల్లని రుమాలును ఆఫీసర్లు వడుకునే కుర్చీలో మామూలుగా జిడ్డుగాఉంటే ఎత్తైన, తోలు తలదిండుకు తగిలించి పుస్తకంతో కాలక్షేపం చేయడానికి స్థిరపడ్డాడు

కెప్టెన్ మిల్లర్‌కు చదువంటే మహా ప్రీతి అందువల్ల అతనికి విసుగే తోచలేదు రాత్రి ఎంత గడచిపోయిందో అతనికి తెలియనేలేదు. హఠాత్తుగా తెల్లవారుజామున 1 గంటలప్రాంతంలో జరిగిన అలజడివల్ల ఉలిక్కిపడి లేచాడు అతని ఎదుట భయంతో తెల్లబోయి వణుకుతూ రక్షకదళపు సార్జెంటు నిల్చొని ఏదో వదురుతున్నాడు

"దుర్ఘటన కెప్టెన్ దుర్ఘటన!"

"ఏమిటి సంగతి?"

"ఘోరవిపత్తు వాటిల్లింది!"

కెప్టెన్ మిల్లర్ కంగారుతో ఎగిరి గంతేశాడు ఎట్లాగో ఓపికబట్టి జరిగిన దుర్ఘటన ఏమిటో ఘోరవిపత్తు ఏమిటో సరియైన వృత్తాంతం తెలిసికోగల్గాడు

## ౩

జరిగింది ఇది: ఇజ్మాయిల్ లోవ్‌స్కీ రెజిమెంటులోని పోస్నికోవ్ అనే సైనికుడు "జోర్డాను" గుమ్మంవద్ద కాపలా కాస్తున్నాడు హఠాత్తుగా అతనికి నేవానది గడ్డ నీటిగుంటలో ఎవడో మనిషి సంకట పడుతున్నట్లూ సాయంకోసం కేకలువేస్తున్నట్లూ తెలియవచ్చింది

పోస్నికోవ్ ఒక పల్లెటూరి కుటుంబానికి ఇంటి దాసుడుగా ఉండేవాడు మిక్కిలి మెత్తని గుండె కలవాడు ఏమాత్రమూ కష్టం చూడలేనివాడు కొంతసేపు ఆ దూరపు మొరలూ మూలుగులూ విన్నాడు అతనికి ఏమీ తోచలేదు ఆవేగంతో ఇలా ఇటూ ఆటూ చూడసాగాడు నదిగట్టు పొడుగునా పరికించినా ఎక్కడా ఒక్క పిట్టైనా కానరాలేదు

ఆ మునిగే మనిషికి సాయానికి ఎవరూ లేరు తప్పకుండా వాడు అడుగుకు పోతాడు

ఈలోపున ఆ మనిషి కొట్టుకొంటు న్నాడు—అబ్బ ఎంతసేపు ఎంత ఆరాటంతోనో

ఆ మనిషి అట్లా కొట్టుకునేకన్న ఊరు కాని మునిగిపోవడమే మంచిదనిపిస్తుంది కాని వాడు లొంగిపోవడంలేదు అతని ఏడ్పులూ బ్రతిమాలడాలూ ఎప్పటికప్పుడు వినిపిస్తూనే ఉన్నాయి అంతకంతకు భవనపు రేవుకు దగ్గరగా వినవస్తున్నాయి అంటే ఆ మనిషి ఇంకా దారి తప్పిపోలేదన్నమాట తిన్నగా దీపాలవైపుకే వస్తున్నాడు కాని ఆ ఏమీచేయు అతనికి సరిగా ఎదురుగుండానే తోర్రాను నీటిగుంట ఉంది అక్కడ తప్పక మునకిందికి పోతాడు దానితో అయిపోతుంది మళ్ళీ నిశ్శబ్దం ఒక నిముషానికి నీటితో కొట్టుకుంటున్న చప్పుడు—"రక్షించండి రక్షించండి" అని కేక ఇప్పుడు నీటితో అతని కొట్టుకోవడం కనిపించేటంత దగ్గరలో ఉన్నాడు

పోష్నికోవ్ ఆ మనిషిని రక్షించడం సులభమేమో ఆలోచించడం మొదలు పెట్టాడు మంచుమీదికి పరుగెత్తితే ఆ మనిషి అక్కడే ఉంటాడు ఒక తాడు కొనకాని ఒక గడకాని ఆఖరికి తుపాకికాని అందించైనా అతన్ని రక్షించవచ్చు అందించినదానిని చేతితోపట్టుకొని బయటకు ఎగిరి పడేటంత దగ్గరగా ఉన్నాడా మనిషి కాని పోష్నికోవ్‌కు తన సర్వీసు షరతులూ ఒట్టూ జ్ఞాపకం ఉన్నాయి తను కాపలా సైనికుడనని అతనికి తెలుసును కాపలా వాడు ఎప్పుడూ—ఏపరిస్థితిలోనైనా—తన కాపలాపెట్టె విడవకూడదు

మరి అటు పోష్నికోవ్ గుండె లొంగేది కాదు ఆ మనిషికోసం ఆరాటపడుతోంది ఆతురతతో గిజగిజలాడుతోంది అబ్బ! దానిని పెరికివేసి దూరంగా గిరవాటేస్తే ఎంతబాగుండును ఈస్థితి దుర్భరం నిజం చెప్పితే ఒకడు సంకటపడుతూ ఉంటే సాయంచేయడానికి పూర్తి అవకాశం ఉండికూడా చేయకపోవడం ఘోరమే కాపలాపెట్టెకు కాళ్లరావుగదా పెద్ద మువ్వేమీరాదు "ఏమో తెగించిచూస్తే— ఏం?—ఎవరికీ తెలియదు—అయ్యో భగవంతుడా ఇదెట్లా గడిచేది! అదిగో మళ్ళీ మునుగుతున్నాడు "

ఇట్లా జరుగుతున్న అరగంటసేపూ పోష్నికోవ్ హృదయం తల్లడిల్లిపోయింది "ధర్మసందేహాలు" కలగడం మొదలు పెట్టాయి అయినా అతను తెలివీ తేటలూ గల సైనికుడు చురుకైనవాడు మెదకాయ ఉన్న తలకాయ ఉన్నవాడు కావలావాడు తన కావలాపెట్టెను విడిచిపోవడం గొప్ప నేరమనీ వెంటనే "కోర్టుమార్షల్" జరుగుతుందనీ బహిరంగంగా కొరడాల దండనో దేశభ్రష్టత్వమో బహుశా మరణశిక్షకూడా విధింపబడవచ్చుననీ అతనికి తెలుసును కాని నదినుంచి అంతకంతకు దగ్గరగా గుండెను కరగించివేసే కేకలు వస్తున్నాయి నీటిలో గుటకల చప్పుడూ ప్రాణంకోసం గిజగిజలాడడమూ అతను స్పష్టంగా విన్నాడు

"మునిగి-పో-తు-న్నా-ను — రక్షించండి మునిగిపోతున్నాను"

ఇప్పుడు వాడు మంచుగుంట చేరుకున్నాడు —ఇక దేవుడి దయ!

పోష్నికోవ్ మళ్ళీ నిస్సహాయంగా అటూ ఇటూ చూశాడు అన్నివైపులా చూశాడు ఎక్కడా ఒక్క పిట్టయినాలేదు—దీపాలు మాత్రం గాలిలో అల్లల్లాడుతూ మినుకు మినుకుమంటున్నాయి ఆ గాలిలో [illegible] అరుపు—ఆఖరి కేకేమో

మళ్ళీ నీటిచప్పుడు దీర్ఘరోదనం నీటిలో బుడబుడ శబ్దం

కాపలావాడు ఇక ఆగలేకపోయాడు తన స్థానం విడిచిపోయాడు

౪

పోష్నికోవ్ బల్ల చెక్కమెట్లమీదకి పరుగెత్తాడు దడదడమంటున్న గుండెతో మంచుగడ్డమీదకి తొరగా ఆ గుంటలోని


బహిష్టు ఆగినదా?

"దేవీ మాత్రలు" (Registered by the Central Drugs Laboratory Govt of India under No CDL/688) ఏ కారణమువల్లనైనను ఎన్నినెలలుగానైనను ఆగిన బహిష్టును అతిశీఘ్రముగాను గ్యారంటీగాను అతిసులభముగాను వెంటనే జారీచేయును వేనవేల ప్రశంసాపత్రములు పొందిన గ్యారంటీగల దివ్యౌషధము వరల ఎందులను వాడి మోసపోకుడు. ధర (Ordinary) రు 8 8 0 (Special) కొన్నినెలలుగా ఆగిన వాటికి రు. 10-8-0. వి పి పి ప్రత్యేకము

గర్భనిరోధం

"స్పెషల్ పిల్సు" (Regd. No. 300) సంతానము కోరనివారు 12 రోజులు సేవించిన శాశ్వతముగా 8 సం॥లకు గర్భముకలుగదు బహిష్టు మామూలుగా వెలువడుతూ ఉండును. వేనవేల ప్రశంసాపత్రములు పొందిన గ్యారంటీగల ఔషధము ధర రు. 12-0 0. వి పి పి ప్రత్యేకము

SEENU & CO PB 1638( )MADRAS-1

మంచు దిబ్బీటిలోకి దుమికాడు ఊపిరాడక కొట్టుకొంటున్న ఆ శరీరాన్ని వెంటనే కనిపెట్టాడు తన తుపాకీ అటు చాచాడు

ఆ మునిగే తుపాకి తలకొయ్యను పట్టుకొన్నాడు పోస్నికోవ్ తుపాకి కత్తివైపు పట్టుకొని ఒడ్డుకు లాగాడు

రక్షకుడూ, రక్షితుడూ ఇద్దరూ నీళ్లు కారుతూ ఉన్నారు మునగబోయిన మనిషి అలసిపోయి గడగడలాడుతూ నిలువలేక పోతున్నాడు కాబట్టి పోస్నికోవ్ అతన్ని ఆ మంచుమీదే విడిచిపెట్టి పోలేకపోయాడు మెల్లగా గట్టుమీదకి లాగుకొనివచ్చి ఎవరేనా ఆ మనిషిని పట్టుకొని ఉండగలరేమో చూడసాగాడు ఇదంతా జరుగుతూఉండగా రేవు గట్టుమీద ఒక బండి కనిపించింది అందులో ఆ కాలంలో ఉండే "హౌస్‌హోల్ కంపెనీ ఆఫ్ ఇన్వాలిడ్స్" (తరువాత రద్దు చేయబడింది) అనేదానికి చెందిన ఆఫీసరు ఒకడు ఉన్నాడు

ఈ కుపమయంలో(పోస్నికోవ్‌దృష్ట్యా) వచ్చినవాడు ఏమీ పూచీగీచీ ఎరగనివాడు తిన్ననైన బుద్ధిలేనివాడు వచ్చిఅబద్ధాల కోరు బండిలోనుండి బయటకు ఉరికి ప్రశ్నలు దంచడం మొదలుపెట్టాడు

"ఏమిటి ఇదంతా —ఎవరీమనిషి?— ఎవరు వీళ్లంతా?"

"మునగబోయాడు అడుగున పోబోయాడు "అంటూ పోస్నికోవ్ చెప్పనారంభించాడు

"ఏమిటీ అంటున్నావు మునగడమా?— ఎవరూ మునుగుతున్నది—నీవా? ఈస్థలంలో ఎందుకు?"

ఆ మనిషి నీళ్లు కక్కుతూ ఊపిరికోసం కొట్టుకుంటున్నాడు పోస్నికోవ్ అంతర్ధానమయ్యాడు మాట్లాడకుండా తన తుపాకి తీసుకొని తన కావలాపెట్టె దగ్గరకు పోయి నిల్చున్నాడు

ఆ ఆఫీసరు జరిగిన సంగతి ఊహించుకున్నాడో లేక మరి ఏ ఉద్దేశ్యంతోనో తన ప్రశ్నలు కట్టివేశాడు రక్షించబడిన ఆ మనిషిని తన బండిలోకి గెంటుకుపోయాడు మోర్స్కాయాలో ఉన్న సైకాశాఖకు సంబంధించిన పోలీసు స్టేషనుకు బండి నిలిపిగెత్తించాడు

అక్కడ ఆ ఆఫీసరు డ్యూటీలో ఉన్న సార్జెంటుకి తనతోకూడా ఉన్న తడిసిన మనిషి రాజభవనానికి ఎదుట నదిలో మంచుగులో మునిగిపోబోయాడనీ తన ప్రాణానికి తెగించి అతన్ని రక్షించాననీ స్టేటుమెంటు ఇచ్చారు

అలా సాహసంతో రక్షింపబడిన మనిషి ఇంకా నీళ్లు కారుతూనే ఉన్నాడు చలితో కొయ్యబారి అలసిఉన్నాడు మనస్సు చలించడంవల్లా పడిన విపరీత శ్రమవల్లా అతను స్మృతితప్పిపోయాడు తనను రక్షించినది ఎవరైనదీ సరిగా గుర్తించాడా లేదా అనేది అతనికక్కర్లేకపోయింది

ఒకపక్కన తునికిపాట్లు పడుతున్న పోలీసు డాక్టరు తిరుగులాడుతూండగా ఆఫీసులో సార్జెంటు ఇన్వాలిడ్ ఆఫీసరు చెప్పిన స్టేటుమెంటు ఆధారంగా తన రిపోర్టు తయారుచేస్తున్నాడు పోలీసువాళ్లకు సహజమైన అనుమానంవల్ల ఈ ఆఫీసరు తను ఏమాత్రం తడవకుండా ఎల్లా రక్షించగల్గాడా అని ఆశ్చర్యపోయాడు "ప్రాణసంకటంలో ఉన్నవారిని రక్షించినవారికి"ఇచ్చే"మెడలు" ను పొందే కోరికతో ఆ ఆఫీసరు అదీ ఇదీ కలగలిపి అసంబద్ధంగానూ అనుమానాస్పదంగానూ విషయం వర్ణించాడు పోలీసులు ఇన్‌స్పెక్టరును లేపడానికి పోయారు వివరాలు తెలుసుకోడానికి అన్నివైపులా మనుషుల్ని పంపారు

ఇటు ఈ ఎంఖటసి రాజభవనంలో ఇంకొక రకపు తీవ్రపరిస్థితులకు కారణమయింది

౨

తనవంతు కావలాగదిలోవారికి రక్షింపబడిన మనిషిని తన బండిలో పెట్టుకొని ఇన్వాలిడ్ ఆఫీసరు పోయినతర్వాత జరిగిన పైవిశేషాలేమీ తెలియవు ఇస్మాయిలోవ్‌స్కీ రెజిమెంటులోని ఆఫీసరుకీ సైనికులకీ పోస్నికోవ్ అనే సైనికుడు తన కావలాపెట్టె వదలి ఎవరో మనిషిని రక్షించడానికి తన స్థానం విడిచిపెట్టాడనీ మిలిటరీ డ్యూటీకి గొప్ప భంగం కలిగించాడనీ కాబట్టి అతన్ని "కోర్టు మార్షల్" చేసి కొరడాదెబ్బలు శిక్షవేస్తారనీ మాత్రం తెలుసును కమాండింగ్ ఆఫీసరు మొదలుకొని పోస్నికోవ్ పైవారంతా దీని కారణంగా ఏమి ముప్పువచ్చిపడుతుందో అని ఆందోళన పడసాగారు

సైనికులు తడిసి వణుకుతూఉన్న పోస్నికోవ్‌ను తక్షణం అతని స్థానంనుంచి తొలగించారు కావలా గదికి తీసుకొనివెళ్ళారు అక్కడ అతను విషయం యావత్తూ— మనం ఇంతవరకు తెలుసుకున్నదే—సవివరంగా కెప్టెనుకు వెల్లడించాడు ఇన్వాలిడ్ ఆఫీసరు రక్షితుడని వెంటబెట్టుకొని అడ్మిరాల్టీ పోలీసుశాఖకు బండిని తోలమని తన డ్రైవరుకు చెప్పిన సమాచారం తెలియజేశాడు

ఈకొత్తచిక్కు ఉన్నవిషయాన్ని ఇంకా భయానకమయ్యేటట్లు చేసింది సహజంగా ఇన్వాలిడ్ ఆఫీసరు జరిగిన సంగతంతా పోలీసుసార్జెంటుకు చెప్పివేస్తాడు సార్జెంటు వెంటనే పోలీసుల పర్యాధికారి కోకోష్కిన్‌కు తెలియబరుస్తాడు కోకోష్కిన్ పొద్దున్నే చక్రవర్తికి రిపోర్టుచేస్తాడు ఇంకేముంది కొంప మునిగినట్లే!

ఆలోచిస్తూ కూర్చోడానికి సమయంలేదు పై ఆఫీసరు సలహా తీసికోవాలి

నికొలై ఇవనోవిచ్ మిల్లర్ వెంటనే తన సేనానాయకుడు లెఫ్టినెంట్ కర్నల్ స్విన్‌కు ఎంత తొరగా రాగల్గితే అంత

తొరగా రావలసిందనీ, ఈ విషమపరిస్థితిలో తనకు సాయంచేయవలసిందనీ కంగారుగా ఒక చీటీ రాసిపంపాడు

ఇది తెల్లవారుజామున 3 గంటలప్పుడు కోకోష్కిన్ చాలా పెందలకడనే చక్రవర్తి దర్శనంచేస్తాడు కాబట్టి ఆలోచనకి ఆట్టే వ్యవధి లేదు

౬

లెఫ్టినెంట్ కర్నల్ స్విరివ్‌కు నికోలై ఇవనోవిచ్ మిల్లర్‌కుండే జాలి, కనికరం వంటివి ఏమిలేవు స్విరివ్ రాతిగుండె వాడనికాదు ఆతను ప్రధానంగా—అన్నిటి కంటే ముందు—"సర్వీసు మనిషి" స్విరివ్ తన కఠినత్వానికి పేరుపొందిన వాడు క్రమశిక్షణవిషయంలో తన తీవ్రత్వం ప్రదర్శించడమంటే ఆతనికి సరదాకూడా కీడుచేయాలన్న తలంపతనికి లేదు ఆనవసరపు బాధ పెట్టడానికి ఎన్నడూ ప్రయత్నించలేదు కాని ఎవరైనా సర్వీసు నియమాలను అతిక్రమించాడో ఇంక అతని కాఠిన్యానికి తిరుగులేదు ఆ సమయాల్లో నేరంవెనుక ఉద్దేశాలమీద చర్చకు దిగడం అనవసరమని భావించేవాడు సర్వీసులో తప్పు తప్పే అనే నియమంమీద నిలబడే వాడు అందువల్ల కావలాదళంలో ప్రతివాడికీ పోష్నికోవ్ శిక్ష ననుభవించవలసి వస్తే పూర్తిగా అనుభవించే తీరుతాడనీ అందుకు స్విరివ్ ఏమాత్రం చింతించడనీ తెలుసును

స్విరివ్ అటువంటివాడని అతని పైవారికీ, తోటివారికీకూడా తెలుసును వారిలో కొంతమంది అతనిదృష్టితో ఏకీభవించలేనివారున్నారు ఇంకా అప్పటికి కరుణ, కనికరంవంటి భావాలు పూర్తిగా అంతరించిపోలేదు "దయాళు స్వభావుల" తనను మెచ్చుకున్నారో ఆక్షేపించారో అనేది స్విరివ్ లెక్కచేసేవాడుకాదు అతన్ని కోరడంకానీ బ్రతిమాలడంకానీ అసాధ్యం మనసు మారేటట్లుచేయడం అంతకన్నాను అటువంటివాటి కన్నిటికీ లొంగకుండాఉండేటట్లు కట్టుదిట్టం చేసుకున్నాడు తన కాలం నాటి పదవీవ్యామోహచిత్తులకుండే స్వభావమాతనిది అయినా అతనికికూడా ఒక బలహీనత ఉంది

స్విరివ్ ఉద్యోగజీవితం బాగా ప్రారంభమయింది ఎన్నడూ మళ్ళీ అవనతికలుగకుండా జాగ్రత్తగా చూసుకునేవాడు తన "యూనిఫారం" ఎంత మచ్చలేకుండా ఉంచుకునేవాడో అంత నిష్కళంకంగా తన జీవితంకూడా ఉండేటట్లు చూసుకునేవాడు కాని దురదృష్టంవల్ల తనపెత్తనం కిందేఉన్న సైన్యంలోని ఒక సైనికుడి తప్పిదంవల్ల తన యావత్తు సైన్యంయొక్క క్రమశిక్షణమీద శంక కలుగవచ్చు బాగా ప్రారంభమై జాగ్రత్తగా నడుస్తూన్న స్విరివ్ ఉద్యోగజీవితం ఎవరిమీద ఆధారపడిఉందో వారికి దయాదృష్టితో చేయబడిన కార్యానికి సేనానాయకుడి దోషముందా లేదా అనేది బుర్రకెక్కదు. స్విరివ్ పురోభివృద్ధికి అడ్డు పుల్లలువేసి తన ఏ బంధువుడికో, ఏ ఆశ్రితుడికో అవకాశం కల్పించుకునేవారు చాలా మంది ఉన్నారు "కాదు" ఈ సంఘటనవల్ల చికాకుపడి కర్నల్-ఇన్-ఛీఫ్‌తో క్రమశిక్షణ సరిగా లేదన్నాడంటే వారి పని సులభమే స్విరివ్‌మీదే దోష మెంచబడుతుంది స్విరివ్ అశ్రద్ధగా ఉన్నాడనే వదంతి బయలుదేరుతుంది తనపేరుకు కళంకం ఏర్పడుతుంది తన తోడివారితో ప్రతిష్ఠ సంపాదించడానికిగానీ రష్యా సామ్రాజ్యపు చారిత్రకవ్యక్తుల చిత్రమందిరంలో తన చిత్రమ్మును అలంకరింపజేయడానికిగానీ ఏమీ వీలు ఉండదు

ఆరోజుల్లో చరిత్రపఠనం గొప్పగా పరిగణింపబడకపోయినప్పటికీ ప్రతివాడూ చరిత్రలో నమ్మేవాడు దాని నిర్మాణంలో తాను కూడా పాల్గొనడానికి ఉత్సాహంచూపేవాడు

౭

తెల్లవారుగట్ల 3 గంటలకు కెప్టెన్ మిల్లర్ దగ్గరనుంచి చీటీరాగానే స్విరివ్ ఒక్క గంతుతో లేచిపడి యూనిఫారం ధరించి శీతాకాలభవనపు కావలా గదిలోకి సందేహిస్తూ మందిపడుతూ ప్రవేశించాడు తక్షణం పోష్నికోవ్‌ను పరీక్షచేయ నారంభించాడు నమ్మడానికి వీలులేని ఆ ఘటన నిజంగానే జరిగిందని తెలుసుకున్నాడు కెప్టెన్ మిల్లర్‌కు ముందుచెప్పినట్లుగానే తను కావలాకాస్తున్నప్పుడు జరిగినదన్నీ పోష్నికోవ్ స్పష్టంగా చెప్పేశాడు దేవుడి ముందూ జారుముందూ తాను అపరాధి ననీ తనమీద జాలిపడనక్కర్లేదనీ ఒప్పుకున్నాడు తను కావలాకాస్తూఉండడం నీటిగుంటలో మునిగిపోతున్న వాడి మొరలు వినడం వాడికోసం తాను బాధపడడం జాలిని అణచివేసేందుకు ప్రయత్నించడం చివరకు జాలే గెలవడం, తను స్థానంవిడిచిపెట్టి మంచుమీదకి దుమికి మునుగుతున్నవాడిని ఒడ్డుకు తీసికొని


కుట్టుపని స్వబోధిని (తెలుగు)

Self Tailoring and Cutting Teacher

క్రొత్త పద్ధతిలో కత్తిరించి కుట్టు సాధనలుగలది ప్రతి దర్జీవారికి స్త్రీలకు ముఖ్యము 92 పేజీలు 38 పటములుగల పుస్తకము రు 12 పోస్టు ఖర్చులు అ 6

చేతిపనుల వర్తక రహస్య బోధిని

50 రూపాయలనుంచి 600 రూపాయలవరకు నెలకు సంపాదించవచ్చును ఇందు సబ్బు దినుసులు సెంట్లు అత్తరు హేరాయిల్స్ పన్నరమెంటు వార్నిష్, వర్ణములు పన్నీరు షర్బత్తు ఊదువత్తులు కర్పూరం సిరా దినుసులు గిల్టు యిచ్చేవిధము ఫోటో ఎత్తువిధము బాణసంచా మందులు సులభముగా తయారుచేయు పద్ధతులతో 100 పేజీలు గల పెద్ద పుస్తకము వెల రు 1-8-0 పోస్టుఖర్చు 6 అణాలు

మహారాజా పుస్తకశాల 12, అరుణాచలమొదలి వీధి, మదరాసు

రావడం, దురదృష్టవశాత్తూ రాజభవనపు ఇన్వాలిడ్స్ కంపెనీ ఆఫీసరు చూడటం అంతా పునశ్చరణ చేశాడు

లెఫ్టినెంట్ కర్నల్ స్విన్‌కు ఏమీ పాలుపోలేదు కాని చేయగలిగింది ఒక్కటే చేసి కొంత తృప్తిపడ్డాడు పోష్నికోవ్‌ను వెంటనే అరెస్టుచేయించాడు మిల్లర్‌ను మిలిటరీ సర్వీసులో ఎందుకూ పనికిరాని కవికరవ్వశావానికి గట్టిగా మందలించాడు అయినా పరిస్థితి చక్కబడలేదు కాపలా సైనికుడు తన స్థానం విడిచివేయడంవంటి నేరానికి సాకుచెప్పడం అసాధ్యం సమర్థించడం అంతకన్నాను ఇక బయట పడేందుకు ఒక్కటే దారి ఉంది—చక్రవర్తికి ఈ వ్యవహారం ఏమీ తెలియకుండా దాచడమే

కాని ఇటువంటి వ్యవహారం దాచడం సాధ్యమా?

సాధ్యంకావచ్చే కనిపించింది ఎందుకంటే రక్షణకు సంబంధించిన వివరాలు తెలిసింది ఒక కాపలావారికేగాదు ఆ దుర్మార్గుడు ఇన్వాలిడ్ ఆఫీసరుకుకూడా తెలుసును ఈపాటికి అతను జనరల్ కోక్లోష్కిన్‌కు ఈ సమాచారం తెలిసేటట్లు చేయగలిగిఉంటాడు

ఇప్పుడు ఎక్కడికి పోవాలి? ఎవరిని అర్థిస్తే బాగుంటుంది? ఎక్కడ సహాయం లభిస్తుంది?

గ్రాండ్ డ్యూక్ మైకేల్ పావ్లోవిచ్ దగ్గరకుపోయి అంతా చెప్పివేద్దామని స్విన్ బయలుదేరబోయాడు ఇబ్బందిలో ఉన్న ఆఫీసర్లు సామాన్యంగా వేసే ఎత్తు ఇది గ్రాండ్ డ్యూక్ తొందరపాటు మనిషి మండిపడతాడు అయినా ఇబ్బందిలేదు మొదట్లో ఎంతగా మండిపడితే అంత తొరగా నిమ్మళిస్తాడు తనే మధ్యవర్తిగా వ్యవహరిస్తాడు గ్రాండ్ డ్యూక్‌లో ఈ మార్పులు మామూలే ఒక్కొక్కప్పుడు చేయాలని చేసేవేకూడా ఈవిధంగా సాధించగల్గిందేదో సాధిద్దామని స్విన్ ఎంతో అనుకున్నాడు కాని భవనంలోకి రాత్రివేళ ప్రవేశించి గ్రాండ్ డ్యూక్‌కు నిద్రాభంగం కల్గించడం ఎట్లా? పొద్దున్న వరకూ—కోక్లోష్కిన్ చక్రవర్తికి రిపోర్టు చేసేవరకూ—ఊరుకుంటే లాభం లేదు ఈ చిక్కుల్లోపడి స్విన్ కలతచెందుతూ ఉండగా హఠాత్తుగా అతనికో దారి తోచింది. ఇదివరకు గందరగోళంలో అది తోచనే లేదు

అప్పటి మిలిటరీ ఎత్తుల్లో ఒకటి ఏమిటంటే ముట్టడింపబడిన కోటకు గోడల వైపునుంచి ప్రమాదం రాబోయేటప్పుడు సైన్యాన్ని వెనక్కి తరలించుకునేందుకు వాటిని గోడలదగ్గరే నిలబెట్టివేయడం స్విన్ మొదట్లో అనుకున్నట్లు చేయదలచుకోలేదు తిన్నగా కోక్లోష్కిన్ దగ్గరకే పోనిశ్చయించాడు

పోలీసుల సర్వాధికారి కోక్లోష్కిన్‌ను గురించి పీటర్స్‌బర్గ్‌లో విపరీతమైన కట్టుకథలు చాలా ప్రచారంలో ఉన్నాయి కానీ అతను అద్భుతమైన చాతుర్యమూ ఉపాయమూ కలవాడనీ తన చాకచక్యంతో అతను "ఈగల్ని ఏనుగులుగా చేయడమే కాక అంతసులభంగానే ఏనుగుల్ని ఈగలుగా మార్చివేయగలిగేవాడని" చెప్పుకునేవారు

నిజంగా కోక్లోష్కిన్ చాలా నిర్దాక్షిణ్యుడూ కఠోరుడూను తనంటే ప్రతివారూ హడలిపోయేటట్లు చేసేవాడు కాని అప్పుడప్పుడు ఆయనకూడా నగరంలోని హుషారైన కుర్రవాళ్లుచేసే అల్లరులూ కొంటెపనులూ చూసికూడా చూడనట్లు ఊరుకునేవాడు ఆ రోజుల్లో సైన్యంలో చాలామంది కొంటెగాండ్రకు సమయంవస్తే తను కీయిన సాయం చేయగలడని తెలుసును మామూలుగా చెప్పాలంటే ఆయన సిబ్బుడు తలచుకొన్నట్లయితే ఎంతైనా చేయగలిగే వాడు ఇది స్విన్‌కీ మిల్లర్‌కీ తెలుసును వెంటనే కోక్లోష్కిన్‌తో మాట్లాడి ఆయన ఔదార్యం చాతుర్యంమీద ఆధారపడేందుకు సాహసించడంలో స్విన్‌కు మిల్లర్ బాగా ప్రోత్సాహం ఇచ్చాడు వారుకు కోపం రాకుండా ఈ చిక్కునుంచి ఎట్లా బయటపడగలరో ఆయన తప్పక చెప్పగలడు

స్విన్ తన పెద్దకోటు తొడుగుకున్నాడు ఆకాశంవైపుచూసి భగవంతుని పేరు కొన్నిమార్లు స్మరించి కోక్లోష్కిన్‌ను చూడడానికి బయలుదేరాడు

తెల్లవారుజామున నాలుగు గంటలు దాటి ఉంటుంది



నౌకర్లు పోలీసుల అధికారి కోక్లోష్కిన్‌ను లేపారు చాలముఖ్యమైన అర్జంటు పనిమీద స్విన్ వచ్చినట్లు చెప్పారు

జనరల్ కోక్లోష్కిన్ వెంటనే లేచాడు అంగరఖా తొడుగుకొని మొగం రుద్దుకొంటూ ఆవలిస్తూ చలికి వణుకుతూ స్విన్ ఎదుట ప్రత్యక్షమయ్యాడు స్విన్ చెప్పినదంతా అత్యంత శ్రద్ధతో ఆలకించాడు కాని కించిత్తైనా చలించలేదు స్విన్ యొక్క వివరణలూ ఔదార్యం చూపవలసిందని వేడుకోవడమూ మధ్య ఒకేసారి అడ్డుప్రశ్న వేశాడు

"సైనికుడు తన కాపలిపెట్టె విడిచి మనిషిని రక్షించాడు కదూ?"

"సరిగా అంతే" అన్నాడు స్విన్

"మరి కాపలాపెట్టె?"

"ఆలోపున ఖాళీగానే ఉంది"

"[illegible] ఖాళీగానే ఉందని నాకు తెలుసును దాని నెవరూ దొంగిలించలేదని తెలుసుకొని సంతోషిస్తున్నాను"

ఈమాట వినేసరికి కోక్లోష్కిన్‌కు అప్పుడే అంతా తెలుసునని పొద్దున్నే చక్రవర్తికి ఎట్లా రిపోర్టుచేయడమో నిశ్చ

యం చేసుకునే ఉంటాడనీ ఆ నిశ్చయా నికి తిరుగుఉండదనీ స్విమిన్ అనుమానం దృఢమైంది లేకపోతే భవనంతటికల్లా లోని కావలావైవికుడు తన స్థానం విడిచి పెట్టడంవంటి సంఘటన ఆ పోలీసుల అధి కారిని చలింపజేసిఉండేదే

కాని కోకోష్కిన్‌కు ఏమి తెలియదు రక్షితుడితోబాటు ఇన్వాలిడ్ ఆఫీసరు దర్శిం చిన ఇన్‌స్పెక్టరు ఆ విషయం అంత అర్థం టని తలచలేదు అతినిద్రపుష్టిలో అర్ధరాత్రి వేళ పోలీసుల సర్వాధికారిని లేపేటంత అగత్యమేమీ లేదనిపించింది ఇదేకాక విన్నవృత్తాంతం చాలా అనుమానాస్పదంగా తోచింది ఎందుకంటే ఇన్వాలిడ్ ఆఫీసరు దుస్తులు పొడిగా ఉన్నాయి నిజంగా ప్రాణా నికి తెగించి రక్షిస్తే అట్లా ఉండడం అసం భవం ఇన్స్పెక్టరు ఆ ఆఫీసరు అబద్ధాల కోరనీ ఇంకో మెడలును రొమ్ముమీద అలంకరించుకుందామని ఎత్తువేస్తున్నాడనీ గ్రహించాడు తన కింది ఆసఫీరు పోలీసు స్టేటుమెంటు తయారుచేస్తూఉంటే అతను ఆ ఇన్వాలిడ్ ఆఫీసరుని కబుర్లలోకి దింపి చిన్నచిన్న వివరాలకోసం ప్రశ్నలువేస్తూ నిజమేమిటో పైకి లాగుదామని ప్రయ త్నించాడు

పైగా ఈ సంఘటన తన భాగంలోనే జరగడమూ నీటిలోపడిన మనిషి పోలీసు వాడిచేత కాకుండా రాజభవనపు ఆఫీసరుచేత రక్షింపబడడమూ అతనికి చీకాకు కలిగిం చింది కోకోష్కిన్ అంత శాంతంగా

ఉండడానికి కారణాలు తెలుసుకోవడం సుల భమే మొదటిది గడచినదినం పగలంతా హడావుడిగా ఉండడం రాత్రివేళ రెండు పెద్దమంటలదగ్గర హాజరుకావలసి రావ డంతో అలసిపోయిఉన్నాడు రెండోది పోష్నికోవ్ చేసిన నియమభంగం పోలీసుల అధికారిగా తనకు సూటిగా సంబంధించేది కాకపోవడం

అయినా కోకోష్కిన్ కొన్ని ఉత్తర్వు లిచ్చాడు

సౌకాశాఖ పోలీసు డిపార్టుమెంటు అధి కారిని ఇన్వాలిడ్ ఆఫీసరూ రక్షింపబడిన మనిషితోబాటు తనఎదుట తక్షణం హాజరు కావలసిందని అతను ఆజ్ఞాపించాడు స్విమిన్‌ని తన సొంతగదిపక్క అతిథులుకూర్చొనే గదిలో కూర్చొనిఉండవలసిందని చెప్పాడు తరువాత తన ఆఫీసు గదిలోకిపోయి తలుపు వేయకుండానే ఉత్తరాలు సంతకంచేయడం కోసం బల్లదగ్గర కూర్చున్నాడు తన మెత్తని కుర్చీలో కూర్చొని ఒక నిమిషం తర్వాత చేతుల్లో తలపెట్టుకొని ఆ బల్లమీద అట్లాగే నిద్రపోయాడు

## ౧౦

అప్పట్లో నగరంలో టెలిగ్రాఫులూ టెలి ఫోనులూ లేవు ప్రభుత్వసంబంధమైన ఆర్డ ర్లను త్వరితంగా తీసుకొనిపోయేందుకు గోగోల్ తన అమరకృతి "రెవిజోర్"లో వర్ణించిన "నలభై వేల వార్తాహరులు" పరు గెత్తేవారు

వారు టెలిగ్రాఫు, టెలిఫోనులంత వేగంగా పోలేకపోయినప్పటికీ వారివల్ల నగరంలో కొంత సందడిగా ఉండేది అధి కారులు సదా మెలకువగా ఉన్నారనిపించేది

ఇన్స్పెక్టరూ, ఇన్వాలిడ్ ఆఫీసరూ రక్షి తుడూ సౌకాశాఖ పోలీసుస్టేషను నుంచి హడావుడిగా వచ్చేలోగా జనరల్ కోకోష్కిన్ ఒక కునుకు తీశాడు కొంచెం విశ్రాంతి చిక్కినట్లు అతని ముఖమైఖరిని బట్టీ మాటలతీరులో నిశ్చయధోరణిని బట్టీ తెలియ వచ్చింది

కొత్తగా వచ్చినవారిని అతను తన గది లోకి రమ్మన్నాడు స్విమిన్ కూడా రమ్మ న్నాడు

"రిపోర్టు?" అని కుదుటబడిన స్వరంతో తీక్షణంగా ప్రశ్నించాడు కోకోష్కిన్

ఇన్స్పెక్టరు మాట్లాడకుండా ఒకమడచిన కాగితం అందజేసి అతని చెవిలో ఏదో చెప్పాడు

"ఇతనితో ప్రత్యేకంగా మాట్లాడడానికి అనుమతించవలసింది '

"సరే"

కోకోష్కిన్ కిటికీదాకా పోయాడు ఇన్స్పెక్టరుకూడా అక్కడికి పోయాడు

"ఏమిటది '

ఇన్స్పెక్టరు గొణగొణలూ జనరల్ ఊం కొట్టడాలూ వినవచ్చాయి

"ఊం,నా, ఔను ఊం దాని మాటేమిటి? అది సంభవమే వాళ్లె ప్పుడూ తడవకుండానే నీటిలో మునకలు వేస్తారు ఇంకేమీ లేదా?

"లేదు'

జనరల్ చాటునుంచి ఎదుటికి వచ్చాడు కుర్చీలో కూలబడి చదవడం మొదలు పెట్టాడు లోపలనే చదువుకున్నాడు భయం కానీ సందేహంకానీ కనబడలేదు తరు వాత వెంటనే రక్షితుడి వైపుకు తిరిగి బిగ్గ రగా అడిగాడు



"శవనం ఎదట నీటిలో ఎట్లాపడ్డా వోయ్?"

"పొరపాటు ప్రభూ" అన్నాడా మనిషి

"అదీ—తాగావుకదూ?"

"క్షమించాలి తాగలేదండి తడబడ్డాను అంతే"

"ఆ నీళ్లలోకి ఎందుకు వెళ్లావు?

"మంచుగడ్డమీదుగా అడ్డదారిని పోదామనుకున్నాను దారి తప్పాను గుంటలో జారిపడ్డాను"

"ఎక్కడకు పోతున్నావో చూడలేక పోయావన్నమాట"

"అంతటా కారుచీకటి ప్రభూ!"

"మరి నిన్నెవరు బయటకు లాగారో చూడలేదూ?"

"క్షమించాలి నేనేం చూడలేదు వారు చేశారనుకుంటాను" ఆఫీసరువైపు చూపించాడు మళ్లీ అన్నాడు "ఏమో నిశ్చయంగా చెప్పలేను నాకు భయంతో ప్రాణంపోయి నంతయింది"

"అదీ మర్యాదస్తులంతా నిద్రపోయేవేళ తిరుగుతూ ఉండడమూ! ఇదిగో బాగా చూడు నిన్ను రక్షించింది ఎవరో ఎప్పుడూ జ్ఞాపకం ఉంచుకో ఒక మహానీయుడు నీ కోసం తనప్రాణం ఒడ్డాడు"

"బ్రతికివున్నంత కాలం మరచిపోను"

"ఆఫీసరుగారూ మీ పేరు?

ఆఫీసరు తన పేరు చెప్పాడు

"విన్నావా?"

"విన్నాను ప్రభూ!"

"ఆర్థోడాక్సు మతస్థుడవేనా?"

"ఆర్థోడాక్సువాడినే, ప్రభూ

"ఆయనపేరు ప్రార్థనకోసం చర్చిలో పెట్టించు"

"తప్పక పెట్టిస్తాను, ప్రభూ"

"ఆయనకోసం ప్రార్థన చేయి ఇక బయటికిపో నాకు నీ అవసరంలేదు"

ఆమనిషి వంగి సలాముచేసి బయటకు పరిగెత్తాడు—పోనిచ్చారుకదా అనే మహదానందంతో దేవుడి దయవల్ల అంతా కొత్త దారి నడవడంచూసి స్విరిన్ ఆశ్చర్యంతో మాట్లాడలేకపోయాడు

౧౧

కోకోష్కిన్ ఇన్వాలిడ్ ఆఫీసరు వైపుకు తిరిగాడు

'మీ ప్రాణానికి తెగించి ఈ మనిషిని రక్షించారు గదూ?"

"అవును ప్రభూ"

"జరిగినదానికి సాక్షులెవరూ లేరుకాదా బాగా పొద్దుపోయింది కాబట్టి ఎవరూ ఉండి ఉండరనుకుంటాను"

"లేరు ప్రభూ చీకటిగా ఉంది కాపలా వారికి తప్పితే గట్టంతా నిర్మానుష్యంగా ఉంది"

కాపలావారి మాట ఎత్తనక్కర్లేదు కాపలావాడు తనస్థానం కాపలా కాస్తూనే ఉంటాడు ఎక్కడో జరిగిన విషయం అతని పనికి అడ్డురాకూడదు ఈ రిపోర్టు నిజమని తలుస్తాను ఇది మీ స్టేట్‌మెంటును బట్టి తయారుచేయబడిందే కదా ఏమి?"

ఈవాక్యం కోకోష్కిన్ బెదరిస్తున్నట్లుగానూ మందలిస్తున్నట్లుగానూ గట్టిగా ఉచ్చరించి పలికాడు

ఆఫీసరేమీ జంకలేదు గుడ్లు మిటకరిస్తూ రొమ్ము విరుచుకొంటూ జవాబిచ్చాడు

"నా మాటలమట్టుకు అంతా సరిగానే ఉంది ప్రభూ"

"మీరు చేసిన కార్యానికి ప్రతిఫలం లభించాలి"

ఆఫీసరు కృతజ్ఞతతో తలవంచి నేల రాయసాగాడు

"నాకు కృతజ్ఞత తెల్పనక్కర్లేదు" అన్నాడు కోకోష్కిన్ "మీసాహసకృత్యం గురించి చక్రవర్తికి తెలియబరుస్తాను ఈ వేళే మీ వక్షస్థలంమీద ఇంకో పతకం అలంకరించవచ్చు ఇక ఇంటికిపోవచ్చు వేడివేడిదేమైనా తాగండి ఇల్లు విడిచి పోకండి బహుశా నేను మిమ్మల్ని పిలవవలసి ఉంటుంది"

ఇన్వాలిడ్ ఆఫీసరు ముఖం విప్పారింది చిరునవ్వుతో సలాంచేసి బయటకుపోయాడు

"కోకోష్కిన్ అతనికేసే చూశాడు. మళ్ళీ అన్నాడు

"బహుశా చక్రవర్తే అతన్ని చూడదలుచుకోవచ్చు"

"అవునండీ" అన్నాడు ఇన్స్పెక్టరు తెలిసినట్టుగా

"ఇక మీ అవసరం లేదు"

ఇన్స్పెక్టరు బయటకు పోయాడు తలుపులు మూసి తన అలవాటు చొప్పున చేతితో శిలువసంజ్ఞ చేశాడు

ఇన్వాలిడ్ ఆఫీసరు ఇన్స్పెక్టరు కోసం కింద ఎదురుచూస్తున్నాడు ఇద్దరూ వచ్చేటప్పటికంటె ఎంతో ఎక్కువ స్నేహంగా కలిసివెళ్లారు

పోలీసుల అధికారి గదిలో ఇక స్విరిన్ మాత్రం ఉన్నాడు కోకోష్కిన్ మొదట్లో చాలాసేపు అతన్ని తేరిపారచూశాడు పిమ్మట అడిగాడు

"గ్రాండ్ డ్యూక్‌ను చూడటానికి పో లేదా?"

ఆరోజుల్లో గ్రాండ్‌డ్యూక్ అనే మాటలు ఉచ్చరించేసరికి ప్రతివాడూ అవి గ్రాండ్ డ్యూక్ మైకేల్ పావ్‌లోవిచ్‌కే చెందుతాయని గ్రహించేవాడు.

"నేరుగా మీవద్దకే వచ్చాను." అన్నాడు స్వివిన్

"రక్షకదళంపెత్తనానికి ఆఫీసరు ఎవరు?"

"కెప్టెన్ మిల్లర్ "

"కోకోష్కిన్ మళ్లీ స్వివిన్ వైపు శ్రద్ధగా చూశాడు అన్నాడు

"ఇంతకుముందు ఇంకొకటి చెపా రను కుంటాను "

అతను ఏమనుకున్నాడో స్వివిన్‌కు అర్థం కాలేదు అందువల్ల మాట్లాడలేదు కోకోష్కిన్ అన్నాడు "ఊఁ పరవాలేదు బాగా నిద్రపోండి "

దర్శనం ముగిసింది

౧౨

ఆవేళ మధ్యాహ్నం ఒంటిగంటకు కోకోష్కిన్ ఇన్వాలిడ్ ఆఫీసరును పిలువనం పాడు చక్రవర్తి తన భవనంలోని "కోర్ డీ ఇన్వాలిడ్స్ లో సాహసం, మెలకువగల ఆఫీసర్లు ఉన్నారని తెలిసి చాలా సంతోషించాడనీ అతనికి "ప్రాణాపాయంలో ఉన్న వారిని రక్షించినందుకు" అనే మెడలును బహూకరించాడనీ కోకోష్కిన్ మర్యాదతో అతనికి తెలియజేశాడు ఈమాటలతో కోకోష్కిన్ స్వయంగా మెడలును అతనికి అంద జేశాడు ఇన్వాలిడ్ ఆఫీసరు తన మెడలును ప్రదర్శించేందుకు బయలుదేరాడు ఇంత టితో ఈ వ్యవహారం అంతమైందనుకో వచ్చును కాని లెఫ్టినెంట్ కర్నల్ స్వివిన్‌కి అందులో కొంతలోటుందనీ, తనే అదిపూర్తి చేయాలనీ తోచింది జరిగిన సంఘటనల వల్ల అతను కలతచెంది మూడు రోజులు మంచంమీదనుంచి లేవలేదు నాలుగోనాడు లేచి పీటర్ మహాత్ముని మందిరానికిపోయి ఏసుక్రీస్తు ప్రతిమముందు పందనప్రార్థన చేయించాడు కుదుటపడిన చిత్తంతో ఇంటికి పోయి తననువచ్చి కలుసుకోవలసిందిగా కెప్టెన్ మిల్లర్‌కు కబురంపించాడు

"సరే, నికోలై ఇవనోవిచ్ దేవుడికి వందనాలు అర్పించు." అని మిల్లర్‌తో అన్నాడతను, "మనమీద విరుచుకుపడ బోయిన తుఫాను చెదరిపోయింది కావలా వాడితో ఈగొడవ వదలిపోయింది ఇక మనం నిర్భయంగా ఉండవచ్చుననుకొం టాను దీనికంతా కారణాలు ఒకటి దేవుడి దయ రెండు జనరల్ కోకోష్కిన్ అతను నిర్దయుడనీ రాతిగుండెవాడనీ ప్రజలు అను కుంచే అనుకోవచ్చునుకాని అతని ఔదా ర్యానికి నేను అత్యంత కృతజ్ఞుణ్ణి అతని బుద్ధికుశలత చాతుర్యం అంటే నాకు మహా గౌరవం ఏర్పడింది ఆ ఇన్వాలిడ్ వెధవ కొట్టిన బడాయిని అతను ఉపయోగించిన విధం అత్యద్భుతం నిజానికి ఆ పోగరుకి ఆ వెధవని గుర్రాలదొడ్డిలో పెట్టి మెత్తగా చితుకకొట్టవలసింది కాని ఏం చేస్తాం అనేకమందిని రక్షించేందుకు వానినికూడా ఉపయోగించవలసివచ్చింది దీనితో సంబం ధించినవాచెప్పడికి ఏమీ లేనిరాకుండా అంత నేర్పుతో కోకోష్కిన్ వ్యవహారం నడిపిం చాడు ఓమమిక్కిలి అంతా సుఖంగా సంతోషంగా ఉన్నారు మన ఇద్దరి మధ్య చెప్తున్నాను కోకోష్కిన్‌కు నామీద మంచి భావం ఏర్పడిందని విశ్వసనీయులవల్ల తెలియవచ్చింది ఇంకెవరి దగ్గరికిపోకుండా తిన్నగా తనవద్దకే పోవడం ఆ మెడలును సంపాదించిన మూర్ఖుడితో వాదించకపోవ డం చూసి అతను చాలా పొంగిపోయాడు మళ్ళీ చెప్పాలంటే ఎవరూ చిక్కుల్లో ఇరుక్కోలేదు అంతా నేర్పుగా జరిగిపో యింది కాబట్టి ముందు మనం భయపడ వలసిందేమీలేదు కాని మన విషయంలో ఇంకా ఒక చిన్న లోటు ఉంది కోకోష్కిన్ చేసినట్లుగానే మనంకూడా నేర్పుతో వ్యవహరించాలి ముందు ఎప్పుడైనా అక స్మాత్తుగా చిక్కులువస్తే మనకి ఇబ్బంది రాకుండా ఉండేటట్లు ఈవిషయం మనం పూర్తి చేయాలి తన స్థితి నిశ్చయంకాని వాడు ఒక్కడే ఉన్నాడు నేను చెప్పేది పోస్నికోవ్‌ను గురించి ఇంకా జైలులో అరెస్టులోనే ఉన్నాడు తనరాత ఎట్లాఉందో అని ఆందోళన చెందుతూ ఉంటాడు అతని మనస్సును శాంతపరచే సమయం వచ్చిం దనుకుంటాను "

"దాను వెంటనే చేయాలి " అన్నాడు మిల్లర్ తెరపినబడి

"సరే అట్లాచేయడానికి నీవే తగిన వాడవు వెంటనే దారక్స్‌కు పోయి నీ దళాన్ని పోగుచేసి పోస్నికోవ్‌ను తీసి కొనివచ్చి అందరిఎదుట అతను రెండు వందల కొరడాదెబ్బలు తినేటట్లు చూడ గలవా ?"

౧౩

మిల్లర్ నిశ్చేష్టులయ్యారు స్వివిన్‌ను బ్రతిమాలి అందరికీ సంతోషంగానే ఉంది కాబట్టి రెజిమెంటు బందిఖానాలో తన రాత ఎట్లాఉందో ఎదురుచూస్తూ పోస్నికోవ్ ఇప్పటికే చాలా మనోవ్యథ అనుభ వించాడు కాబట్టి అతన్ని కనికరించి, పూర్తి క్షమాపణ ఇచ్చేటట్లు ఒప్పిద్దామని ప్రయత్నించాడు కాని స్వివిన్ మండి పడ్డాడు మిల్లర్‌ని మరి మాటాడనీయ లేదు

"కాదు కాదు "అంటూ అడ్డుచెప్పారు "ఊరుకో నాన్న వివేకంతో వ్యవహరించా లని చెప్పానోలేదో నీవు అప్పుడే అవివే కపు పని మొదలుపెడుతున్నావు ఊరుకో!"

స్వివిన్ తన గొంతుక కటువుగానూ, అధికారయుక్తంగానూ మార్చి దృఢంగా చెప్పాడు

"ఈవిషయంలో నీదికూడా కొంత దోషం ఉంది మిలిటరీవాడికి ఉండకూడని మెత్తనితనపు మనేది నీకు ఉంది కాబట్టి నీదే ఎక్కువదోషం అవుతోంది నీ స్వభావంలో ఈ లోటే నీకిందివారి శిక్షణలో ప్రతిఫలి స్తోంది అందువల్ల నీవు స్వయంగా దగ్గం

ఉండి దెబ్బలు బాగా తగిలేటట్లు చేయవలసిందని నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను దీనికిగాను సైన్యంలో కొత్తగా చేరిన పడుచువాళ్లనే దెబ్బలు కొట్టమని ఆజ్ఞాపించవలసింది పాతవారికందరికీ తమలోతమకి ఔదార్యం చూపించుకోవాలనే భావం పెరిగిపోయింది వాళ్లు తమ తోటివారి వద్దిమీద ఈగలను తోలడంతప్పితే గట్టిగా కొట్టనేకొట్టరు తరువాత నేను స్వయంగావచ్చి దండన ఎంత బాగా జరిగిందీ చూస్తాను"

పైఅధికారి ఆజ్ఞను తోసిపుచ్చడం అసంభవం కాబట్టి జాలిగుండెకల కెప్టెన్ మిల్లర్ తనకు చెప్పబడిన రీతిగానే చేయవలసి వచ్చింది

ఇస్టాయ్ లోవ్‌స్కీ బారక్సుముందరి ఆవరణలో దళం నడిపించబడింది కొట్లో నుంచి కావలసినన్ని బెత్తాలు వచ్చాయి పోష్నికోవ్‌ను బందిఖానానుండి తీసికొని వచ్చారు సైన్యంలో కొత్తగా చేరిన యువకుల సాయంతో శిక్ష అమలుజరుపబడింది ఆ యువకులకు పాతవారికి ఉండే ఔదార్యం ఇంకా అలవడలేదు కాబట్టి సేనానాయకుడు కోరినప్రకారం పోష్నికోవ్ వద్దిమీద కావలసిన గుర్తులు వాళ్ళు చక్కగా ముద్రించారు శిక్షఅయినతర్వాత పోష్నికోవ్‌ను అతను దెబ్బలుతిన్న పెద్దకోటుతోనే ఎత్తుకొని రెజిమెంటు ఆసుపత్రికి తీసుకుపోయారు

౧౪

శిక్ష అమలుజరుపబడిందని రిపోర్టు చేరగానే సేనానాయకుడు స్వినిన్ ఆసుపత్రిలో పోష్నికోవ్‌ను పెద్దవాడి రీతిగా వెళ్ళి చూశాడు తన ఆజ్ఞ తు చ తప్పకుండా జరిపించబడిందని ఒకచూపులో గ్రహించాడు జాలి మెత్తదనంకల పోష్నికోవ్ మెత్తగా చితకకొట్టబడ్డాడు స్వినిన్ తృప్తి పడ్డాడు స్వస్థతకోలుకునే కాలంలో కొంత బాధోపశమనానికిగాను తనపేరున ఒక పౌను పంచదార, పావు పౌను టీయాకు దెబ్బలు తిన్న పోష్నికోవ్‌కు ఇయ్యవలసిందిగా ఉత్తర్వులు జారీచేశాడు తన కొట్టులో పడుకొనిఉన్న పోష్నికోవ్ ఈ ఉత్తర్వులు విని అన్నాడు

"చాలా సంతోషం కలిగింది ప్రభూ ఓ అపారదయకు కృతజ్ఞుణ్ణి"

నిజంగానే "సంతోషించదా" దతను బందిఖానాలోఉండి ఇంతకన్న కఠిన యాతనకు సిద్ధమైఉన్నాడు ఆ దిక్కుమాలిన రోజుల్లో కోర్టుమార్షల్ తీర్పుకింద ప్రజలు అనుభవించే శిక్షలకు ముందు రెండు వందల దెబ్బలనేది ఒకలెక్కకాదు ఇంతకు ముందు చెప్పిన కొన్ని సాహసపు చెత్తలు నేర్పైన జోక్యంవల్ల కాకపోతే పోష్నికోవ్‌కూడా అంత తీవ్రమైన శిక్ష అనుభవించవలసివచ్చేది

ఈ సంఘటనవల్ల సంతుష్టిచెందినవారి సంఖ్య ఇంతటితో ఆగలేదు

౧౫

పోష్నికోవ్ చేసిన కృత్యపుకథ నగరపు వివిధసమాజాల్లో అనేక తరహాలుగా వ్యాపించింది ఆ రోజుల్లో పత్రికాసంచారం ఆగిపోయి ఉండడంచేత వదంతులే ఆధారంగాఉండేవి ఈ వదంతుల్లో అసలు వీరుడు పోష్నికోవ్ పేరు మరచిపోబడింది కాని అనేక ఆకర్షణీయమైన కల్పనలు కథకు జోడించబడ్డాయి ఎవరో గొప్ప ఈతగాడు పీటర్‌పాల్ కోటనుంచి రాజభవనంవైపుకు నదికి అడ్డంగా ఈదుతున్నాడనీ భవనం దగ్గర కాపలాఉన్న సైనికుడొకడు అతని మీదకు తుపాకిపేల్చి గాయపర్చాడనీ అప్పుడు ఒక ఇన్వాలిడ్ ఆఫీసరు నీటిలోకి దుమికి ఆ ఈతగాడిని రక్షించాడనీ అందుకుగాను ఒకడికి తగిన సత్కారమూ రెండోవాడికి తగిన శిక్షా లభించాయనీ ప్రజలు చెప్పుకోసాగారు ఈ విపరీత వదంతి మఠంలోకికూడా చేరింది అప్పట్లో ఆ మఠంలో వివేకశాలియైన ఒక చర్చి అధికారి ఉన్నాడు ఆయన లౌకికవ్యవహారాలంటే అంత లెక్కచేయనివాడుకాదు ఆయనకు స్వినిన్ కుటుంబంతో మంచి పరిచయం ఉంది

ఆ చురుకైన మతాధికారికి ఈ కథ స్పష్టంగా లేదనిపించింది రాత్రివేళ ఈదినవాడెవడు? తప్పించుకుపోతున్న ఖైదీ అయితే కాపలావాడిని ఎందుకు శిక్షించవలసివచ్చింది? నేవానదిలో కోటదగ్గరనుంచి ఈదుకొస్తున్న అతనిమీదకి కాల్చి కాపలావాడు తన డ్యూటీయే చేశాడు అట్లాకాక, ఈదినవాడు ఖైదీకాక మరో గూఢవ్యక్తి అయితేమాత్రం కాపలావాడికి ఎట్లా తెలుస్తుంది? జనం చెప్పుకునేదానిలో తప్పు ఉండితీరుతుందని ఆయన గ్రహించాడు సామాన్యులు వదంతినే నిజమని నమ్ముతారు కాని మఠాల్లోనూ సంఘాల్లోనూ ఉండేవారు విషయం ఎక్కువ శ్రద్ధతో పరిశీలిస్తారు వారికి సత్యంతో సంపర్కంకూడా ఎక్కువ

౧౬

ఒకనాడు ఆశీర్వాదం పొందేటందుకు ఈమఠాధికారిని స్వినిన్ దర్శించడం సంభవించింది అప్పుడు ఆ అధికారి "తుపాకి దెబ్బ"వృత్తాంతం తెలిసికోగోరాడు స్వినిన్ ఉన్నవిషయమంతా—మనకు తెలిసిందే—వివరించాడు దీనికీ అంతటా చెప్పుకునే దానికీ ఏమీ సంబంధమేలేదు

ఆ స్వామి తన రుద్రాక్షలను మెల్లగా తిప్పుతూ, స్వినిన్‌పైపే చూస్తూ నిశ్శబ్దంగా సరియైన వృత్తాంతం విన్నారు స్వినిన్ తన కథనం పూర్తిచేసిన తర్వాత స్వామి మెల్లగా దీర్ఘాలతో అన్నారు

"సరిగా యథార్థాన్ని అనుసరించి ఈ విషయం ప్రకటింపబడలేదని గ్రహించవలసి వస్తోంది"

స్వెవిన్ తటపటాయించాడు టిబోర్డు తయారుచేసింది జనరల్ కోకోష్కిన్ అని తనుకాదని తప్పించుకోబోయాడు

"అసత్యానికి అసంపూర్ణ సత్యానికి భేదం గమనించాలి "

మళ్ళీ రుద్రాక్షలు మళ్ళీ నిశ్శబ్దం చివరికి మెల్లగా మాటల ప్రవాహం

"అసంపూర్ణసత్యం అసత్యంకాదు దీనిని గురించి ఎంత తక్కువగా చెప్పితే అంత మంచిది

"నిజంగా అంతే" అన్నాడు స్వెవిన్ పై మాటలకు కొంత ఉత్సాహంవచ్చి "నన్ను కలతపెట్టేది ఏమంటే ఈ పై నిజుణ్ణి నేను రక్షించవలసిరావడం అతను నియమాలను అతిక్రమించాడు అయినప్పటికీ "

రుద్రాక్షలు మెల్లగా దీర్ఘాలతో అద్దు మాట

"ఉద్యోగ నియమాలను అతిక్రమించరాదు

"అవును కాని అతను గొప్ప ఔదార్యంతో సహానుభూతితో చేశాడు అదైనా ఎంతో తీవ్రవ్యథ నిమ్మట పైగా ప్రాణానికి తెగించి చేశాడు ఇంకొకరిని రక్షించడంలో తనకే ముప్పుతెచ్చుకుంటున్నానని అతనికి తెలుసును అది మహోత్కృష్టమయిన పవిత్రభావం

'పవిత్రత అనేది భగవంతుడికే తెలుసును సామాన్యుని శరీరంమీద దండన అనేది అంత హానికర మేమీకాదు ధర్మశాస్త్రం ఉద్దేశ్యానికి మనుష్యాచారానికి విరుద్ధ మేమీకాదు మోటుశరీరం ఆత్మయొక్క సూక్ష్మమైన ఆరాటంకన్న దండననే సులభంగా సహించగలదు ఈవిషయంలో నీవుచేసిన కార్యంవల్ల న్యాయానికేమీ భంగంకలుగలేదు

"కాని రక్షించినందుకు ప్రతిఫలంకూడా అతనికి లభించలేదు

"రక్షణ అనేది ప్రతిఫలంపొందవలసిన ఘనకార్య మేమీకాదు ప్రధానంగా అది కర్తవ్యమే రక్షించగలిగి రక్షించలేకపోయినవాడు న్యాయరీత్యా శిక్షార్హుడు కాని రక్షించినవాడు తనకర్తవ్యం చేసినవాడుమాత్రం అవుతాడు "

కొద్దిసేపు విరామం రుద్రాక్షలు దీర్ఘాలతో గొణుగుడు

"పైనిరుడికి తన సాహసానికి పతకాలూ బహుమతులూ పొందేకన్న అపకీర్తి గాయాలూ పొందడమే ఉత్తమం ఈవిషయంలో అన్నిటికంటె ముఖ్యమైనది ఈ రహస్యం ఎంతో జాగ్రత్తగా గుప్తపరచడం ఎన్నటికీ ఎట్టిపరిస్థితుల్లోనైనా ఒకరు చెప్పింది ఇంకొకరికి చెప్పకూడదు

స్వామివారుకూడా సంతుష్టులైనట్లే కనిపించాయి

## ౧౭

తను అపరిమిత విశ్వాసంతో భగవంతుని విధివిధానంలోని మాయనే అధిగమించగల్గిన ఆ మహాత్ములకుండే ధైర్యమే నాకుంటే తను సృష్టించిన అల్పజీవి పోష్నికోప్ నడతవల్ల ఆ పరమాత్ముడె సంతోషించిఉంటాడని ఊహించడానికి సాహసించేవాడిని కాని నా విశ్వాసం చాలడంలేదు అంత ఉన్నతశిఖరాలకు లేవడానికి నా మనస్సుకు తగిన శక్తి లభించడంలేదు నేను భౌతికప్రపంచానికి సంబంధించే ఆలోచించగలను ఎటువంటి పరిస్థితుల్లోనైనా ప్రతిఫలాపేక్షలేకుండా సద్గుణాన్ని త్రికరణశుద్ధిగా ప్రేమించే మానవులను తలచుకుంటున్నాను ఆ సత్యవంతులూ విశ్వాసవంతులూ నా యీ నైపుణ్యం లేకపోయినా సత్యమైన కథలోని నాయకుని ఉత్కృష్టప్రేమభావాన్ని పవిత్రసహనాన్ని చూసి సంతోషిస్తారని తలుస్తాను

వైబ్రొ
గర్భాశయ రోగ నివారిణి
సుప్రసిద్ధ బలవర్ధ ఔషధము సర్వవిధ బహిష్ట చిక్కులను పూర్తిగాపోగొట్టి సత్సంతానమును కలుగజేయుటలో మా వైబ్రో మిక్కిలి ఘనత వహించినది. అన్ని షాపులలో దొరకును.
స్టాకిస్టులు. అప్పా అండు కొ. మద్రాసు
కృష్ణా లేబరేటరి, బెజవాడ.

# ప్యాకింగ్ కేసులు



మీరు కావలసిన సైజులలో
ప్యాకింగ్ కేసులను
మేము తయారుచేసి
ఇవ్వగలము

## జోస్ ఇండస్ట్రియల్స్,

ఒల్లూర్ (కొచ్చిన్ స్టేట్)



ఆ ఇద్దరి పాపల ఆటలూ, పాటలూ చూచి
ఆ తల్లి మురిసిపోతోంది

ఆ తల్లి ఆరోగ్యంగా ఉండటంవల్లే
అంత చక్కని పిల్లలు పుట్టేరు

ఆమె ఆరోగ్యానికి ప్రతిరోజూ
ఏమిటి చేర్చుకుంటుందో తెలుసా ?

## లోధ్ర

కేసరి కుటీరం లిమిటెడ్

రాయపేట, మదరాసు-14

# "నేను వ్రాసిన వేమిటంటే" — "కల్పనావ్యాసములు"

కవికొండల వేంకటరావు

[ఈ అంశమును గురించిన ఉపన్యాసము 29-7-1961 తేదీని శ్రీ కవికొండల వేంకటరావుగారు—శ్రీ కొండకొలను-వికసితోత్సవ-రాజమహేంద్రవర కేంద్రప్రభ వదేండ్లపండుగ సందర్భములో ఇచ్చినది ]

భగవంతుని కృపవలన తిరుగ మనం ఇక్కడ సమావేశము కాగలిగాం ఇంతమంది నేడీ ఉత్సవమందు పాల్గొంటూ వున్నారు అంటే నే వ్రాస్తున్నది వింటూవున్నారు అంటే అది ఈ ఉద్యమమువల్ల మీకున్న సామరస్యమును వేనోళ్ళ చాటుతూ వుంది కొంతకాకపోతే కొంతైనా నా రచనములను అర్థముచేసికో గలరని ఈ "ఆలివనాంధ్రకార్యస్థానము" వారి ప్రచురణాదికమును వ్యర్థముకానీయరని నేను ఊహిస్తూవున్నాను

అచ్చుపడుతూవున్న పుస్తకములు ఎప్పటికప్పుడు మీచేతుల్లోకి వచ్చి మిమ్ములను ఇతోధికపాఠకులనుగా చేయనగునుగాని అచ్చుపడకుండావున్న రచనలు ఈ ఉపన్యాసములగుండా తెలి యకోవ తెలిసినదే

ఈ శీర్షికవిద్యాది ఆరువ్యాకటన ఉపన్యాసము—"కల్పనా వ్యాసము"లను గురించి—లోగడ ఇచ్చిన ఆరు ఉపన్యాసములున్ను వరుసగా (1) గీతికలు (2) ఖండకావ్యములు (3) ఆయత నిర్వచన పద్యకావ్యములు (4) మహాగీతికలు (5) నాటకాదులు (6) కథలు వీనిని గురించినవి మీకు జ్ఞాపకమున్నదో లేదో 26-2-1950 న సుమారొక సంవత్సరము గడచిపోయినది, కథలగూర్చి నేను మాట్లాడినాను

ఆమాత్రము వ్యవధివుండబట్టే, కథలనుండి కల్పనావ్యాసాల్ని వేఱుచేసి దానినొక ప్రత్యేకవిషయముగా నేడు మీ ముందుంచి మాట్లాడగల్గుచున్నాను నిజానికి కల్పనావ్యాసాలుకూడా కథల వంటివే చదువమొదలుపెడితే పేజీనుండి పేజీ అవిరళంగా అవ గాహనచేసికొంటూ చివరవరకు వెళ్ళేదాకా విడువబుద్ధికాదు వేరుక పూర్తికాదు అయితే కథలు కథలే కల్పనావ్యాసాలు కల్పనా వ్యాసాలే అని నా సూచన దాని ద్వారా వివేచన ఎప్పుడు జరుగ గలదు అంటే "వ్యాసము" అన్న శబ్దాన్ని ముందు అర్థంచేసి కొన్నప్పుడే

"వ్యాసము" అంటే వ్యాసమహర్షి రచించిన భారత భాగ వతగ్రంథాల్లాంటిది అని కాదు నేటి నిర్వచనము ఇంగ్లీషులో "ఎస్సే" వంటిదని "ఎస్సే" శబ్దం అవలబుపెట్టి యోచిస్తే తెలుగు శబ్దం దొరుకదా? దొరుకవచ్చు ఏదైనా "ఏరోప్లేను"కు వాయు విమానములాగ "రేడియో"కి "ఆకాశవాణి"లాగా అవితే ఆ శబ్దం వ్యాసమువల్లగాని వ్యాసమునకు వెనుక హంగుగానుండి స్ఫురించే "ఎస్సే" వల్లగాని కలిగేటంత భావగంభీరత కలుగకపోవచ్చు ఇంతకూ తెలుగు సారస్వతంలో నేడు "వ్యాసము" అన్న శబ్దము ఒకానొక విధమైన గద్యరచనాకారమును సుబోధము కావిస్తూవున్న ప్పుడు మరోమాటకోసం మరోమాటకోసం వెదకులాడ్డం అనుచితం

వ్యాసాల్లో అనేక రకాలున్నాయి ఇవన్నీకూడా సారస్వతపు మట్టానికి లేస్తాయా అంటే లేవు లేవనేరవు "ఆర్థికవ్యాసాలు" "రాజకీయవ్యాసాలు" "సంఘసంస్కరణ వ్యాసాలు" ఇలా అంకెలు అక్షరాలు తు చ తప్పకుండా పరిపుచ్చుతూ ప్రసిద్ధ సిద్ధాం తాలమీద ఆధారపడి వ్రాసినవికున్నా అవన్నీ సారస్వత సన్నివేశం కలవై రసస్ఫూర్తి నొందగూర్పవు కాని వాటివలనే విజ్ఞానంమీద కొంతవరకు ఆధారపడి "అవును" "జరిగిందే" అని అనిపిస్తూన్న మనలను వెంటవెంటనే మఱపించి మరో మంచి త్రోవకు మళ్లించే మహోత్కృష్టతగల వచనఖండికలు ప్రతిభాషలోను వెలువడి వున్నాయి మన భాషలోను వెలువడివున్నాయి అవి యివి అని మనం నేర్వడంలోనే స్థితప్రజ్ఞ వుంది

ప్రయాణాలు ప్రమోదాలు ప్రమాదాలు పరాభవాలు రచ యితలకు సంబంధించిన కొంత పావనకాలం వన్నింటినీ తనని కానట్టు తలపోసికొంటూ కలతచెందకుండా, కలలాగు చిత్రించు కొంటూ వెనుక్కు తిరుగచూచుకొన్నప్పుడు తనకు సంబం ధించని తారుమారు స్వరూపంలో కాసై ప్రతిఫలించవలసివుండే అదే కల్పనము అది యొక విధమైన కనికట్టు

అందుకే "జంటలు" అన్న పుస్తకాన్ని 1930 లో ప్రచు రించినప్పుడు "హుషార్" అని ముకుటంపెట్టి పాఠకులను హెచ్చ రించాను "ఇందు నిజ మెంత కల్పన మెంత అని పాఠకులు తెలిసి



కి వ్మె క

కానబోయేరు కనక. ఏమో? ఆయాస్థలాలు స్వయంగా చూచివచ్చి ప్రయత్నిస్తే తెలుస్తుందేమో" అని

ఏనాటికి "ఉండవిల్లి కొండపల్లి భువనేశ్వరము జగన్నాథము, అంతర్వేది, మొగలితుర్రు పెద్దతిరుపతి, చంద్రగిరి రాజమహేంద్రవరము ధవళేశ్వరము" ఈ వూళ్లన్నీ ప్రతీమానవుడు తిరుగవచ్చు తెలిసికోవచ్చు కాని వారికి "చందు" ఎక్కడ కనిపించగలదు? "సంతు" ఎక్కడ దొరకగలదు? మరిన్నీ చంద్రగిరి చూచినప్పుడు "కీర్తిచీర" ఏలా తోచగలదు? ధవళేశ్వరము చేరుకునేలో "జవరాలి జడగంటలు" ఏలా మ్రోగగలవు?—ఈ వ్యాసాలు చదవకపోతే

అవన్నీ పది వ్యాసాలు ఒక ఊరికి ఒక ఊరుదగ్గర సావుండి రెండేసి రెండేసి వూళ్లుగా నిరూపించడంచేత "జంటలు" అని దానికి నామకరణం గావింపబడింది

"జంటలు' అనేవి ఎప్పుడున్నాయో "విజ్ఞోళ్లు" అనేవి రాకమానవు. కాని జంటలను విడదీయగా వచ్చిన విజ్ఞోళ్లు కావు అవి అవి ఒందొంట మరోరకం బాదరాయణ సంబంధముకలవి అవింకా పూర్తికాలేదు పూర్తి సంఖ్య "పది"చేయగలవని వాటికూడా అచిరకాలంలో అవి నా నమ్మకం అయితే అవి దూరప్రయాణములమీద ఆధారపడివుండే వ్యాసాలు అవి అలాంటి ప్రయాణాలు లోగడ మూడు పర్యాయములు మాత్రమే నాకు తటస్థించి వూరుకుంది (1) బెజవాడ-బెంగుళూరు (2) బెంగుళూరు-బెజవాడ రెండూ ఏకంచేసుకు ఊహించుకోవడంలో ఒక రైలు పట్టా మార్గవలయం తోచకమానదు అదీ ఆ రెండు వ్యాసాలకూ గల అన్యోన్యసంబంధం రెండూకూడా "ఆనందవాణి"లో అప్పుడప్పుడు పడ్డాయి

ఒక వ్యాసంలో "అప్పుడో నల్లటి పిల్ల తెల్లటి చీర కట్టుకున్నది—పెద్ద ముస్తాబూ అదీ లేకపోయినా ముద్దుగుమ్మే" అని చిత్రించాను ఇది నిజమా అంటే ఎవరు చెప్పను? నిజమల్లా రైలు మార్గమొక్కటే నాటికీ నేటికీ కానవస్తుంది ఆపిల్ల? ప్రయాణాన్ని ఉత్తరిప్రయాణంగా తోచనీయని కవికట్టు? మధ్యమ వినుగుగొల్పే స్టేషనులు పేరుగ్గా పాఠకుడు దాటెయ్యడానికి రచయిత ఏర్పరచిన చిన్న సన్నివేశం అదే కథలో అనితే ఆపిల్ల కథానాయిక అయివుండేది మరి బెంగుళూరునుంచి బెజవాడకు తిరుగరావడంలో నల్లటి పిల్ల తెల్లటిపిల్లగా మారిపోయింది "ఒక యురేషియన్ యువతి" అని వర్ణింపబడుతుంది దారి చూపిస్తుంది రయిలుకు "ఎఱ్ఱటి గౌను, పెదాలకు లిప్‌స్టిక్ పాదాలకు హైహీల్డు షూస్—" అనితే ఆమె నాతో రైలు వదిలేపర్యంతమే వుందికాని తరువాత గుడ్‌నైట్? గుడ్‌బై—అవల కాంతి మున్న, గటుమీదా గండిమీదా గాఢాంధకారమే ఈ వాక్యాల పొందికలో వుంది సారస్వతపు చమక్. ఈలాంటివి లేకపోతే రచన వృత్తి రైల్వే గైడ్ షో.

మూడో ప్రయాణం రాజమండ్రినుండి కలకత్తాదాకా నే చేసిన 1917 లోని ప్రయాణం—నేనప్పట్లోనే "కాంగ్రెసు" సమావేశానికి డెలిగేట్‌గా వెళ్లిందీని సర్వసాధారణంగా అలాంటి ప్రయాణాల వర్ణన అంతా రాజకీయవ్యవహారాలను గురించే అయివుండగలదు కాని నేనో? ఒక డయిరీని కలిపించి రోజువారీ వారంరోజుల దినచర్య అందులో చూపించినట్టు వ్రాశాను అదే రాజకీయవ్యాసం అయియుండి మితవాది అతివాదుల పరస్పరవాగాడంబరం పూసగ్రుచ్చినట్టు పొందుపఱచబడివుంటే, తప్పకుండా ఆరోజువారీ చిఠా చూపించమని వుందురు నేనున్న మీరడిగిన వెంటనే చూపించే బాధ్యత వహించి వుండివుందును కాని ఇది కల్పనా వ్యాసం కావడంవల్ల పాఠకుడలాంటివేమీ అడుగడు దేశభక్తి పూరితుడై Swaraj is my Birth Right! అని "జనగణమన" పాడి తన్మయుడౌతాడు మఱి విజ్ఞోళ్ల ప్రస్తుతం వ్రాసినవి లేవు కాని మఱోగుంపు ఒకటి తయారు అయిందివుంది

అది "పంచారామాలు" అన్న చిన్న గుంపు దీనిమార్గం ఇలాగ్గా తయారౌతుంది అని ఎన్నడూ నేను అనుకోలేదు అసలు ఆంధ్రదేశంలో ఈమాదిరి మానసికచైతన్యం కలిగించే ఒకానొక దేవాలయ సమీకరణము వుందనే మున్ను ఎఱుగను ఒకటి రెండు చూచినతరువాతను "ఆరామ" శబ్దంగల ఇతరస్థల నామధేయాలు అన్నీ తెలుసుకుని అప్పుడు గ్రహించగలిగాను "పంచారామాలు" అన్న గుంపు. అన్నిచోట్ల కాలాది కలం పట్టడంలో—ఊహాగోళమ్మీద మెఱిసి మేలుకొల్పింది ఒకానొక తేజోరేఖ—అదే నేలమీద గీతగీసి చూస్తే గీతమ్మట "కుమారారాం దక్షారామం క్షీరారామం ప్రాద్యారామం అమరారామం" దృగ్గోచరమయ్యాయి అన్నీ ఆంధ్రదేశంలోనివే సామర్లకోట భీమవరం ద్రాక్షారం, పాలకొల్లు గుణుపూడి భీమవరం నాలుగు చెప్పానా? అయిదోది అమరావతి పోల్నాడునుండి పల్నాడుదాకా ఒకే జాలు అన్నీ కళాఖండికలే. ఒకదాన్నిమించి ఒకటి కనిపిస్తూ తుదకు కళాశిఖరాగ్రమో అన్నట్టు అమరావతి చేరేం "గోతలమ్మట పురాతనపు గతి కొత్తకోతలి బంగారు పొత్తాలపు పువ్వులా అన్నట్లు మిఱుమిట్లు గొలిపింది"

ఇప్పట్లో ఒక గీతిక నే వ్రాసినది "కళకు ఆయుక్షీణమా?" అన్నది చనపుకోడం అప్రయత్నం కాదనుకొంటాను. [చింతచిగురులో కలిసిమెలిసి అన్నది "విశాలవిశ్వము"లో ఈ దరిమిలా అచ్చుపడింది] కళకు ఆయుక్షీణత వుండదని ధ్వని ఎన్నాళ్లు చూచినా కళ కళే.

మఱికొన్ని వున్నాయి ఈ "కల్పనావ్యాసా"లకు చేరికైనవి. ఈ శీర్షికమందదగ్గవి అవి పొగకర్రలు అవి ఎనిమిది వ్యాసాలు "పొగకర్ర" అన్న శబ్దానికి మీలో పెక్కుమంది కర్థంతెలియక పోవచ్చు కాని కృష్ణాపత్రికాసంపాదకులు చక్కగా అర్థంచేసుకొని ఒక రచన "సిల్హాటి నృత్యాలు" అన్నదాని నెత్తుకొని తమపత్రికలో అచ్చొత్తిస్తూ ఇలా పాఠకలోకానికి ఎఱుకపఱిచారు "ఏవేవో, అమకోని అందని విచిత్రవిషయాలవేరి—చిత్రకల్పన చేస్తుంది ఇటీవల "పొగకర్ర' అనే శీర్షికలో వీరు వ్రాస్తూన్న వ్యాసాలలో ఇది ఒకటి ఈ సిల్హాటీ నృత్యాలలో—కవి తండ్రి మరణించినపుడు ఆ మునిమాపువేళ సూర్యాస్తమానంలాగా వెలిగే మహాజ్యోతి దానివద్దనే కదిలే వల్లని నీడలు కొన్ని కనిపించాయి—భావవీథిలో వాటి ప్రతిబింబమే ఈ వ్యాసం ' అంటూ వ్యాసం అంతా చద వడం అంటే ఇప్పుడు కాలయాపన

"పెద్దకాంతి పెద్దమంట పెద్దచెరువుగట్టుక్రింద మెఱక భూము పోకనే మామిడిచెట్టుమీద ప్రకాశమానంగా ఊగుతూవుంది ఆ వెలుగుముందు నల్లని నీడలు ఏవో కర్రలుచ్చుకు కదలిస్తూ వున్నట్లు గోచరించినాయి '—నిజానికి కావ్యంలోని ఆ వెలుగు ముందు ఎవరు నిలబడ్డా సిల్హాటిచాయగా మారకమానరు ఈవ్యాసా నికి ముందు వ్యాసము "మాతృచిహ్నము అన్నది "నిలువునా నేలమీద పండబెట్టి మా అమ్మమీద నాటిరాత్రి కప్పినట్టి ఓ తెల్లటి దుప్పటిరేకు ' ఆ తెల్లటి దుప్పటిగూడ రాజహంస రెక్కల్లా విప్పారి కనిపిస్తూ కవికి నైజనైర్మల్యాన్ని ఎప్పటికప్పు డొడ గూరుస్తూ వున్నదనడమే ఈ వ్యాసమునందలి ప్రతిపాదకము మృత్యువునుగురించి ఎఱుగని అమాయకపు శైశవానుభవము అంతకుమించి ఎట్లుండేని? అలా సంఖ్య లింకా ఆరు వ్యాసాలు కలవు ఈరకంగా ఒకదాంట్లో మా బామ్మ ముసిలావిడ పోతే ఆమె చితాభస్మం బుట్టకట్టి ఓ వెదురుపొదకో వుంచుతారు కోటి లింగాలరేవులో కలపడానికి దాన్ని బండికెక్కించకుండానే అంతకు ముందురాత్రి దొంగ లా బుట్ట ఏదో డబ్బుబుట్టలని పట్టుకుపోతారు ఆ విషయాన్ని పొందుపరుస్తూ ఒక కల్పనావ్యాసం "బామ్మ—అమ్మమ్మ—కక్కబామ్మ" అన్నది తయారయింది "ఆంధ్ర మహిళ' లో అచ్చుపడింది ఈ గుంపులో మొన్న మొన్ననే ప్రక టితమైంది "సీసాలో గాలి " మీలో చాలమంది కది తెలిసేవుంటుంది అయినా ఇప్పుడు దాని బిరడా తీసేకన్న మఱోగుంపునకు చేరడం మేలు

ఆది "అనిమేషములు" అన్నది అవి అన్నీ పది వ్యాసాలు వరుసగా 1899 మొదలు 1908 వఱకు సంబంధించినవై యుంటాయి ఒక్కొక్కసంవత్సరమునకు ఒక్కొక్కవ్యాస మంట గట్టవచ్చును మఱన్నీ కవియొక్క పాఠశాలావిద్యార్థిదశ నిని విరూపిస్తూ కొంత వెనరు కొంత నీతి బోధిస్తాయి. "పిడలపటకావాలో ప్రారంభమై "అయితే మెట్రిక్యులేటు లేకుంటే పేట" అన్న వ్యాసంతో ఆగుతాయి

చదివి తెలిసికోవలసినదేగాని చెప్పడానికి సాధ్యంకాదు ఈ వ్యాసాలగుండా కవికి "వంతెనక్రిందుగా పావికొండల కావడు" కనిపిస్తాయి; కళింగలాంతౌర్లనే "విభుదేంద్ర భూపాలు" మెలు స్తాయి బజారుబిల్లలో భిల్లనాయకుడిని ధనుష్టంకారము వినిపి స్తుంది "బడిగంటలో బండిగంటలు" మాఱుమ్రోగుతాయి "చింతచెట్టు కొట్టివేయబడ్డంలో పెద్ద శూన్యాకాశము నిచింతనం గొల్పుతుంది పేకమేడమంది టార్పెడోదాకా అంతా మన ప్రక్షే కనిపిస్తుంది ఇక 1906 లో కవి హర్యాబర్డ్ అండ్ ఆర్థరులో ఆర్థరు పాత్ర ధరిస్తాడు 1907 లో "వందేమాతరం" సంకీర్తనం గావి స్తాడు 1908 లో పోల్‌స్టార్ ఫొనీషియా యూరేనస్ యూరే ఏయా బినోడెర్మవరైన్ను బినోబారిక్లైన్ను ఒరుగ్వేపెరుగ్వే ఈక్వినాక్సు ఈక్వేటర్" మున్నైన యావత్తు భగోళధర్మాలు ఖవిశిమర్మాలు కనుగొంటాడు ఎక్కడ? "ఫిలిప్సు మాడెరన్ స్కూలు ఎట్లాసు"లో;—ఈ పది వ్యాసాలు ఒకదానివెనుక నొకటి చదువుకొంటూపోతే గొలుసుకట్టుగా కొద్ది పాఠశాలయాలు ఈవూళ్లోనే కనిపించకమానవు; అన్నింటిల్లోనుఎప్పుడో నాకప్పుడు కవి ప్రాతవిద్యార్థియే;

మెట్టుమీద ఈ కల్పనావ్యాసాలన్నవి ఇప్పటికో నలభై యున్నాయి కాని కవికి ఏళ్లు గడచినకొద్దీ పెఱుగదగ్గ శీర్షిక ఈ శీర్షికే హెచ్చు అనుభవంమీద ఆధారపడి ఆ అనుభవాన్ని అన్యాని దిగా భావిస్తూ దానికి ఆనందరూపం కట్టడమనేదే యీ కల్పనా వ్యాసాల పరమావధి

గీతిక

నీ మెత్తుకు వన్నెదుగనిమ్ము;
నీ పత్తువ వన్నెఱుగనిమ్ము;
ఆపకొద్ది అనుభవంబు
అంత నాదె అని జాఱిన
జిహ్వాగ్రము చివర నిలచు
మాటలోనె కలదు వింత
వింత తెలియు విధమువేఱు-
అనుభవంబు నీ రచనము
గనుచేనుక క్రమశిక్షణ
మున వర్ణన వేయుటయే
వింత తెలియువిధము దేవ;

VIJAYA'S THREE GEMS

# ASOKA

AMLA VEPA BRAHMI

VEGETABLE HAIR OILS






MEDICATED & DELIGHTFULLY PERFUMED HAIR TONICS

VIJAYA CHEMICAL & TOILET WORKS

"VIJAYA MANSIONS"

15, CLEMENS ROAD, PURASAWALKAM, MADRAS 7.

విజయా రత్నత్రయము

అశోకా అమ్లా, వేప, బ్రహ్మి హేరాయిల్సు

అనాదిగా భారతీయులచే పై మూడు (అమ్లా, వేప, బ్రహ్మి) వృక్షములు పూజింపబడుచున్నవి. యేలనగా వీటియందుగల అమూల్యమైన ఓషధిగుణమే కారణము. ఈ అమూల్య గుణములను కోరువారు ఈ ఓషధులతో తయారు చేయబడిన పై హేరాయిల్సును ఉపయోగించిన పై గుణమేకాక యింపగు పరిమళమును పొందగలరు. కేశ పోషణకు మెదడు - కన్నులకు - చల్లదనము ఇచ్చుటలో సాటిలేనివి

విజయా కెమికల్స్,

15, క్లెమెన్సు రోడ్డు పురసవాక్కం

మదరాసు-7

# రూ. 2500 ఉచితము

## మీరు కోరినది పొందండి



మీ రిపుడేమీ బెంగపడ నక్కరలేదు ఈ ఉంగరం ధరించుటవలన అన్నింటిలోను జయము పొందవచ్చు ఎంతటి పాషాణహృదయంగల స్త్రీ పురుషులైననూ నీస్వాధీనమై నిన్ను ప్రేమించుటయేగాక నీ పాదదాస్యము చేయుచు నిత్యము నీకు దాసినయై సంచరించును వ్యాపారము, పందెము పరీక్షలు మొదలైనవాటిలో ఇది జయము చేకూర్చును గొడ్రాలికి పుత్రుడుదయించును చనిపోయిన వారితో సంభాషించవచ్చు తాత తండ్రులు దాచిన రహస్య ధనముల సంగతి నీకు కలలో తెలియచేయును దుష్టనక్షత్రాల చెడుఫలాలను అణచివేసి అపాయకరమైన రోగాలనుంచి రక్షించును ఇటు సూర్యుడటు ఉదయించవచ్చు గాని ఈ ఉంగరం శక్తి ఎన్నడూ వ్యర్థకాదు నూటికి 100 పాళ్లు విజయం లభించును వెల 12 అణాలు ప్రత్యేకం రూ 2 ఇంకా ప్రత్యేకాధిక్యమైన శక్తివంతమైనది 2-12-0

ఇది అబద్ధమని ఋజువు చేసినవారికి రూ 1500 బహుమతి ఇవ్వబడును నమ్మనిచో ధనం వాపసు చేయబడును ఇంగ్లీషులోనే ఉత్తర ప్రత్యుత్తరాలు జరపండి

BENGAL MAGIC HOUSE, Sikh Temple, (Dept 289/15) AMRITSAR

# ఏరిన ముత్యాలు

## ఆంధ్రులు - హాస్యం

గోళ్ళమూడి రామచంద్రరావు

ప్రపంచంలో ఒక్కొక్క జాతిప్రజల లక్షణాలను తెలుసుకునేందుకు వాళ్ల వెనకటి చరిత్రమూ, ప్రస్తుత ఉద్దేశాలనూ తెలుసుకోవటం అవసరమని అందరికీ తెలుసు. అయితే వీటన్నిటికన్నా బాగా వాళ్ల లక్షణాలను తెలుసుకొనేమార్గం మరొకటి ఉన్నది వాళ్లనుగురించి ఇతరులు చెప్పుకునే వినోదాలూ వాళ్లలోవాళ్ళు చెప్పుకుని సంతోషించే హాస్యాలూ వాళ్ల లక్షణాలని ఇంకా సూక్ష్మంగా తెలియజేస్తవి

బయటివాళ్లు చెప్పుకునేవాటిలో కొన్ని ముఖ్య లక్షణాలు కనిపించినా, ఇతర విషయాలు వాళ్లు ఎదటివాళ్లను అపార్థం చేసికొనటం గోరంతలను కొండంతలు చేయటం అరుదుగా ఉండే అంశాలను జనమందరికీ అంటగట్టటం మాత్రం జరుగుతుంది. అందుకని ఎవళ్లకువాళ్లు చెప్పుకునే వినోదాలు ప్రవర్తన మొదలైనవాటిని గమనించవలసి ఉంటుంది. తెలుగువాళ్ల జీవితంలో ప్రతిదానికీవెనక హాస్యం ఇమిడిఉన్నదని జాగ్రత్తగా గమనిస్తే కనిపిస్తుంది హాస్యం అనేదానికి అర్థం చెప్పవలసివస్తే నవ్వించటం నవ్వగలగటం అని చెప్పవచ్చు

తెలుగు చరిత్రలో తెలుగు బిరుదులనేవి బొత్తిగా కనిపించవు. ఎంతసేపటికీ సంస్కృత బిరుదులు కన్నడ బిరుదులు పార్శీ బిరుదులు కనిపిస్తవి. ఆ భాషలు మాట్లాడే ప్రభువులు ఇచ్చిన బిరుదులు కనుక అవి అట్లాగే ఉన్నవి అని సరిపెట్టుకునేందుకు వీలులేదు తెలుగు ప్రభువులుకూడా వీటినే ఉపయోగించేవాళ్లు అయితే ఎందువల్ల తెలుగువాళ్లు ఇతర భాషల బిరుదులను వాడతారు అని పరిశీలిస్తే వాళ్లకు నవ్వగలశక్తి ఉండటమే కారణమేమో అనిపిస్తుంది.

చప్పున మాటకు ఎదురుమాట వేయటం, వంకరవి చేసినవాళ్లకు ఎదటివాళ్లు "శాస్తి" చేయటం మొదలైనవికూడా వినోదం కలిగించే సంగతులే అవతలివాళ్ల దెబ్బతీయాలని మహా ఉమ్మసుతో వెళ్లినవాళ్లల్లా వ్యవహారం పెడదిరిగి ఉక్కిరిబిక్కిరి అయి మనల్ని నవ్విస్తారు. అన్ని దేశాంవాళ్లూ ఈ రకం హాస్యానికి ఆనందిస్తారు కాని తెలుగువాళ్లు అందరినీ మించిపోయారు. తెనాలి రామలింగనివంటి ఉద్దండపిండాలు ఇతర జాతుల్లో ఎంతమంది ఉన్నారు? రాజా బీర్బల్ ఉన్నాడేమో కాని అయినకూడా గోదావరిసీమ నుంచి వెళ్లినవాడేనని చెపుతారు.

తెలుగు ప్రజలను అన్ని కవిత్వాలలోకీ చాటు పద్యాలు ఎక్కువ ఆకర్షిస్తవి ఈ చాటువులలో ముప్పాతిక మువ్వీసం ఎవరినో ఒకర్ని ఎగతాళి చేస్తూఉన్నవే వినోదాలు నశించిపోకుండా పద్యరూపంలో పెట్టి చాటువులుగా ప్రచారంచేయటం జరిగింది ఇందువల్లో ఒకరినొకరు వేళాకోళం చేసుకుంటూ పేరంటాలు మొదలైనవాటిల్లో పాడే పాటలుకూడా ఇటువంటివే

తెలుగు సారస్వతాన్ని పరిశీలించేవారు తెలుగులో హాస్యరచనలు కనిపించవేమని ప్రశ్నిస్తూ ఉంటారు తెలుగువాళ్లు మామూలు జీవితాన్నే హాస్యంగా తీసుకోబట్టే వాళ్లకు హాస్యరచనలు లేకపోయినట్లు కనిపిస్తుంది. తెలుగువారు దేనినీ సీరియస్‌గా తీసుకోరు అందుకని వచ్చే సారస్వతమంతా సీరియస్‌గానే ఉంటుంది. తమిళులు ప్రతివిషయాన్ని సీరియస్‌గా తీసుకుంటారు. అంతా ఒక పద్ధతిప్రకారం చేసుకుపోతారు. అందుకని తమిళంలో ముప్పాతికపాలు హాస్యాలు వస్తూఉన్నవి ఈనాటి సాహిత్యం ప్రస్తుతం ప్రజల తత్వాన్ని వివరించటంకన్నా, వాళ్ల ఆశయాలను చిత్రించటానికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తూఉండటమే దీనికి కారణం

తెలుగు సారస్వతంలో హాస్యరచనలు లేకపోలేదు అవి క్రమక్రమంగా పెరుగుతున్నవి కూడా వీరేశలింగంగారు హాస్యాన్ని సంఘ సంస్కారానికి ఉపయోగించారు. ఇవి జనాన్ని నవ్వించగలిగినవి. పానుగంటి నరసింహారావుగారి "సాక్షి" కూడా ఈవిధంగానే నడిచింది. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు "గణపతి" వంటి హాస్యనవలను వ్రాయటమేకాక, దేశంలో వాడుకలోఉన్న వినోదాలను సేకరించి సంపుటాలుగా ప్రకటించి సాహిత్యానికి ఎంతో సేవచేశారు.

గురజాడ అప్పారావు, మొక్కపాటి నరసింహశాస్త్రి మునిమాణిక్యం నరసింహారావు, విశ్వనాథ కవిరాజు మొదలైనవారు అందరికీ సుపరిచితులే. భమిడిపాటి కామేశ్వరరావుగారు ఆయన అభిమాన రచయిత అయిన మొలియర్ వలెనూ స్టీవెన్ లీకాక్ వలెనూ మాటల గారడీతో హాస్యాన్ని సృష్టిస్తారు పాలంకి రామచంద్రమూర్తిగారి నాటికలలోనూ, కీ శే పూడిపెద్ది వెంకటరమణయ్యగారి కథల్లోనూ, ఏ జీ హోడ్‌హౌస్ వలె హాస్యసంఘటనలను సృష్టించి వాటికి హాస్యరసాలతో మెరుగుపెట్టటం కనిపిస్తుంది

రాజకీయాలను విమర్శించే వికటరచనలు వ్యంగ్యరచనలు చాలా వస్తున్నవి. ప్రజలకు బరువుగా ఉండే రచనలమీద మోజు తగ్గిపోయింది. తేలికగా, కులాసాగా సరదాగా చదువుకొనటానికి వీలయ్యే రచనలమీద ఆసక్తి ఎక్కువయింది ఈ రచనలలో దాసు వామనరావు (కాలక్షేపం) జి ఎన్ మూర్తి (కులాసా కబుర్లు) మొదలైనవారు చాలా నైపుణ్యాన్ని సాధించారు.

కి వెన్నెల

తెలుగుదేశంలో హాస్యాన్ని గురించి చర్చించేటప్పుడు తలిసెట్టి రామారావుగారి పేరు చెప్పక తప్పదు. బొమ్మలతో హాస్యాన్ని చూపించి, దేశాన్నంతటినీ నవ్వించి క్రొత్త ఒరవళ్లు దిద్దారు ఆయన. దీనిని చాల ప్రోత్సహించి పైకి తీసుకుని వచ్చిన భారతి ఆంధ్రపత్రికల నిర్వాహకులకు తెలుగువారు చాల కృతజ్ఞులై ఉంటారు.

—సౌభాగ్య (మార్చి 53)

## కవిత్వం ఒక మహోద్యమం

సింగిరెడ్డి నారాయణరెడ్డి

"విశ్వశ్రేయః కావ్యం" అని నిర్వచించిన నన్నయభట్టారకునినుండి నేటివరకూ కవిత్వ నిర్వచనాలు ఇంచుమించుగా ఇదే పాకంలో వచ్చాయి కవి కేవలం స్వానందప్రాప్తికొరకే కావ్యగీతి నాలాపించక, విశ్వశ్రేయస్సుకోసం తన కృతిని నిర్దేశించవలయును. దినదినం పరిణామదశ నుండి గడుస్తున్న సాంఘికజీవన విధానాన్ని ప్రతిబింబించడానికి కవికృత కావ్యం ప్రవిమలదర్పణం లాంటిది. ఉత్తమకవి హృదయఫలకంలో వాతావరణం తన చిహ్నాలని అస్పష్టరూపకంలో ముద్రిస్తుంది. ఏతత్ వాతావరణం ప్రభావంవల్ల కవిహృదయంలో నిద్రిస్తున్న నిగూఢానుభూతులు ఉన్నగా కలెత్తుతుంటాయి. ఈ అవ్యక్తానుభూతుల సంఘర్షణవల్ల భావం పరిపక్వమై ప్రవృద్ధమై కావ్యరూపంలో సముద్గతమౌతుంది తీవ్రమైన అనుభూతుల రాపిడివే హృదయతంత్రులు స్పందించినతర్వాత వెల్వడిన వినూత్న కావ్యం విశ్వవిపంచికి వింతశ్రుతుల నేర్పుతుంది. ఇట్లా ఆవిర్భవించిన కావ్యం ప్రజానీక సుఖదుఃఖాల చిత్రించి వారి నవజీవన భవనాలకు పునాదుల తీయిస్తుంది ప్రజల దైనందిన సమస్యాపరిష్కారానికి వెలుగు తెన్నులుచూపి వారికి శ్రేయస్సౌఖ్యం సమగ్ర పాక మందించినప్పుడే "విశ్వశ్రేయః కావ్యం" అను నానుడికి సార్థకత ఏర్పడుతుంది

నన్నయాదులు "విశ్వశ్రేయః కావ్యం" అని నిర్వచించినా దాని ప్రయోజనం ఆనాటి దృష్టిలో వేరు. ప్రజలను ఐహికబంధవిముక్తుల గావించి, ఆధ్యాత్మికంగా పరిశుద్ధులచేసి, ఆముష్మికసౌఖ్యం పైన దృష్టి మరలించడంలోనే విశ్వశ్రేయస్సు అంతర్లీనమై ఉందని నన్నయాదిప్రభృతుల అభిమతమై ఉండేది. ఈ అభిమతమైనా కేవలం ఆశయరూపంలో ఉండేదికాని ఆచరణీక్యా ఏకొందరు రాజాధిరాజులనో, ధనవంతులనో సంతోషపెట్టడానికే నాటి కవుల్లో పెక్కురు పురాణ ప్రబంధకావ్యాల విరచించినారు వారి కావ్యాల్లోని కథానాయకులు అలంకారశాస్త్ర ప్రకారం మలచబడిన అగ్రకులజులేకాని రాజసౌధాలను నిర్మించే నిరుపేద కూలి ఎన్నడూ కాలేదు సామాన్య మానవజీవితాంశాలు వాళ్ల దృష్టిలో కావ్యవస్తువులుగా అగుపించలేదు కారణం? నాటికవుల్లో భోగలాలసత ధనాశ విశేషంగా ఉండడమే పోతనలాంటి ఏకొందరు కవిపుంగవులనో మినహాయిస్తే మిగతా కవీంద్రులందరూ తమ కావ్యకన్యకలను నరేంద్రుల కంకితమిచ్చి కనకాభిషేకాదుల చేయించుకున్నవారే

నేడు కాలంలో ఒక అనిర్వచనీయమైన మార్పు కలిగింది భౌతికజగత్తులో కలిగిన ఈ నవపరివర్తన అంతవరకే ఆగక కళాలోకంలో కూడా కావలసినంత సంచలనం కలిగించింది "కళ కేవలం కళకోసమే" అని సూత్రించిన పూర్వుల అభిప్రాయం తప్పని; మానవజీవితంలో సన్నిహితసంబంధ మేర్పరచుకోని కళ వట్టి కళయే అను ప్రబలభావం ప్రబలిపోయింది. కవిత్వం కళాకిరీటానికి శిరోమణిలాంటిది కావున కావ్యమణి విశ్వమానవప్రగతికి నిర్మల కాంతిపథాలను చూపాలని ప్రతి కళాపిపాసి విశ్వసిస్తున్న కాలమిది. ఇలాంటి తరుణంలో కవిత్వం కేవలం కవుల గ్రంథపేటికల్లో నిర్బంధింపబడక సదా సామాజికుల రసనాలపై తాండవిస్తూ వుండాలి ప్రజల హృదయకుడ్యాల్లో అది శాశ్వతంగా సజీవంగా చిత్రించబడాలి కవులు ప్రజాజీవితరంగంలోకి చొరబడి వారి కష్టాలకు అశ్రుబిందువుల నిచ్చి, వారి సుఖసమయాల్లో ఆనందాన్ని పంచుకోవాలి అప్పుడే కవిత్వం ప్రజాజీవన నిర్మాణానికి మహోద్యమంగా మారుతుంది

ప్రజాసమస్యలను పరిష్కరించడానికి రాజకీయోద్యమానికి ఎంత స్థానముందో అంతే కవిత్వోద్యమానికి ఉండాలి ఇంతవరకు కవులు ఏ పండితగోష్ఠిలోనో, విద్వత్సభలోనో కావ్యగానంచేసి తనిసిపోతున్నారు. విద్వాంసుల దూషణ భూషణలవరకే కవిత్వం ఆగిపోతుంది ఇట్లా గాకుండా కవి తన రచనలను ప్రజామండలిలో వినిపించినపుడే కవిత్వం ఉద్యమం రూపువహిస్తుంది ఏ రాజకీయోద్యమమైనా ప్రజాబలం ఉంటేనే ముందు కుపక్రమిస్తుంది ఉద్యమం యొక్క ఆశయవివరాలు సంపూర్ణంగా తెలియకున్నా దాని ముఖ్యోద్దేశాలను తమలో జీర్ణించుకొంటే ఆ ఉద్యమానికి తగిన అండ లభిస్తుంది. కవి రచనల ప్రతిపదార్థం ప్రజలు గ్రహించలేకున్నా ఆ రచనలు వినగానే వారిలో క్రొత్త అనుభూతులు ఆవిర్భవించినట్లయితే రాజకీయోద్యమంకన్న కవిత్వోద్యమమే విజయవంత మౌతుంది రాజకీయ నాయకులు ఉపన్యసించినప్పుడు ప్రజలు ఉద్రిక్తులై చప్పట్లు మ్రోగించినట్లే కవి కావ్యగానం చేస్తుంటేగూడ ప్రజలు ఉత్సాహపూరితులై తలలూపాలి. ఐతే నూటికి ౧౦ ౧౨ మంది అక్షరాస్యులున్న భారతదేశంలో ప్రజలెంతవరకు కవిత్వరసాన్ని ఆస్వాదించగలుగుతారనేది చర్చనీయాంశము ఉపన్యాసాలను ఎంత సునాయాసంగా అర్థంచేసుకోగలరో కవిత్వాన్ని అంతే సులభంగా అర్థంచేసుకోవడం కష్టమే వాళ్ళ నిత్యవ్యవహారంలో ఉన్న తేలిక పదాల్ని ఉపయోగిస్తేమాత్రం అర్థంచేసుకో గలుగుతారు. అట్లా అని పేలవమైన పదాలతో కవన మల్లినట్లయితే రచనలు నీరసంగా తయారయి సాహిత్యపు విలువలు క్షీణిస్తాయి సాహిత్యం జీవనదిలాంటిది అది గంభీరంగా జీవిత తటులను ఒరసికొని ప్రవహించాలంటే ప్రళయవర్షాలే కురియాలి గాని చిరుతుంపర నిష్ప్రయోజనం సాహిత్యప్రత్యేకతల కాపాడుతూ కవిత్వాన్ని ఉద్యమంగా పురోగమింపచేయాలంటే కవి తన రచనాస్థాయినుండి క్రిందికి దిగజారిపోనవసరంలేదు అప్పుడప్పుడు సూక్ష్మపథాల్లో విశాలార్థాల్ని ఇమిడించి సమాసాలైనా సులభంగా బోధపడేటట్లు విరచించి శ్రుతిపేయాలైన మధురపదాలను ఝరీవేగంతో దూకించి సెలయేటి మర్మరధ్వనుల రణింపజేసి, ప్రళయ ప్రణయదృశ్యాలను ప్రతిబింబించి, వింతవింత విన్యాసాలతో గమత్తులతో చమత్కృతులతో తన కావ్యాన్ని నడిపించి ప్రజాహృదయాలను ఆకర్షించాలి. వాళ్లను తన రచనాస్థాయికి ఈడ్చితెచ్చుకోవాలి వాళ్ళ మెదళ్లలో తన రచనల్లోని భావం గ్రహించాలనే మనసు కలిగేటట్లు శ్రావ్యంగా, ఉచితాభినయంతో గొంతెత్తి చదివి వినిపించాలి. అప్పుడు ప్రజల్లో జిజ్ఞాసతృష్ణ ఇనుమడిస్తుంది కవిత్వాన్ని అర్థంచేసికొని తమ జీవితాలతో సమన్వయం చేసుకోవాలనే కాంక్ష విస్తరిస్తుంది కవిత్వం ఉద్యమం రూపువహించి ప్రజాజీవనంలో భాగస్వామి అవుతుంది

కవిత్వోద్యమ ముఖ్యాశయాలు, శాంతి సమతా సౌభ్రాతృత్వాలు—సమరోన్మాదప్రపంచానికి వ్యాప్తి

చెప్పి సమకాలీనోత్తమకావ్యాలు వెలిసే "మరో ప్రపంచ" శిరాలకు చేరుకోవాలని శ్రమజీవుల నుత్తేజపరచడానికి సప్రాణమైన రచనలు సృష్టించ బడాలి. కొన్ని ఉపన్యాసాలకన్న ఒక్క కవితా కళాఖండం జనదృష్టిని ఆకర్షించగల్గుతుంది "శాంతి" గురించి మనం నిత్యం ఎన్ని ఉపన్యా సాలు వింటున్నా "యుద్ధాల మహాగ్నిలోన శాంతి వేదు జోవాన్ ఆర్క్" అన్నంత సజీవ భావ ప్రకటన కవితాసాధనానికే సాధ్యమవుతుంది కుల మత విభేదాలతో మలినమవుతున్న నేటి సమాజాన్ని సంస్కరించడానికి "కుల మతాల క్రమంలోన తెలియని కూచే కుమతిజ్యోతిలాంటి మేధస్సుల నీ తరాజు కూచేనా" అని నిర్మొహ మాటంగా నిలదీసి అడిగే నిర్భరశక్తి కవితోత్కర్ష మంలో నిబిడీకృతమైవుంది "దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్" అన్న గేయఖండం ఎందరిలోనో జాతీయప్రేమను ప్రేరేపించింది "మంచియన్నది మాలయైతే మాలనేనౌదును" అనే మాట అస్పృశ్యతా నివా రణోద్యమానికి ఎంతో సహకరించింది "సామాన్యం చేయుటకై లూటీ దారుణ్యల మధ్యన పోటీ" అని కుంత బ్రద్దలుకొట్టినట్లు చెప్పి సమాజంలోని కుళ్ళును బైటపెట్టేది కవి త్వోద్యమమే ఇలాగే దేశకాల పాత్రోచితంగా తీర్చిదిద్దబడిన కవితాశిల్పం ప్రజాహృదయపీఠా లపై చిరస్థాయిగా నిలుస్తుంది సామాన్య మా నవుల్లో సంఘశాంతి పెంచడానికి మానవికవిప్లవం మహత్తర ప్రేమాయుధం ఇట్లాంటి ఉద్యమంలో కవులంతా సముచితపాత్ర వహించి సంఘాన్ని స్వర్గంగా మార్చడానికి ప్రయత్నించాలి

"పరిమాణాల యుద్ధానికి
ప్రతి గని ఒక ఫైర్ బ్రిగేడ్
అత్యాధునికరక్తరుచికి
ప్రతి పద్యం మద్యపు చుక్క"

అని గానంచేసిన "దాశరథి"లాగే కవులందరూ కవిత్వపు విలువలను లోకానికి వ్యక్తపరచాలి

—కౌముది (మార్చి 53)

# నందన సంవత్సర సాహిత్య సింహావలోకనం

"శ్రీవాత్సవ"

తెలంగాణాలో ఉన్న సాహిత్యచైతన్యం మిగి లిన ఆంధ్రదేశంలో కనిపించడం లేదేమో! అన్ని రంగాలలోను తెలంగాణా కవులు రచయితలు ముందంజవేస్తున్నారు నేటి తెలంగాణా సారస్వత పీఠ పరిశీలిస్తున్నవారు యువకులు, వృద్ధులున్నారు, ప్రతిభావంతుడు ఆయన దాశరథి వయస్సున చిన్నఅయిన యీ కవిలో ప్రాచ్యపాశ్చాత్య సంస్కృతుల సమ్మేళనం—వాటి ప్రభావమూ ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఈ రచయిత కంఠంలో కాంతాసమ్మితమైన కమ్మనికావ్యాలూ పలుకు తాయి. సాంఘిక విప్లవాన్ని అర్థించే గంభీర గర్జ నలూ వినిపిస్తాయి

ఈయన మస్తిష్కంలో లేబొరేటరీ"
ఈ లేబొరేటరీలో కూచుని
కలంపాళీ కొనలోంచి
ఎంత జలంగం కవిత్వం సృష్టించవచ్చో—
ప్రయోగాలు చేస్తున్నారు
మస్తిష్కంలోని మా యింటికి రమ్మని
మా యింటి వెనుకగా—
తాజమహల్ అందాల్లో మెరిసిన షాజహాన్ కీర్తి
ఆ శిల్పులతో

బులుక్కులతో కట్టిన వైయాకరణి సమాధి చూపిస్తారు శిల్పం కూర్చలేని చిత్రించరాని వేదనపడతాడు చిలికిన ఆటంవంటి యీయన బ్రతుకులో ప్రణయం కదాచిత్తట!

ఈ వేదనలో జన్మించిన ఊహింపులు
తొడగడానికి వ్యాకరణమాత్రపు రెడీమేడ్
దుస్తులు లేక
దిసమొలల్తో తిరుగుతున్నాయి లోకానవని
అంటాడు
మళ్లమళ్లగా కాలాన్ని తిరిగి గ్రహించ
మంటాడు
బ్రతుకునిండా చిక్కులు ముళ్లముళ్లగా
ఎదపీయమంటాడు.
చల్లని పాలుతాగే పిల్లలవంటి
రసికశిఖామణుల నాల్కలో

వేడివేడి కవిత్వం చురుకుదనం సహించేలాగా
రాలేదని వాపోతాడు
గతంలోంచి కొంత నేర్చుకోలేక
గతానికి తాకట్టు పడుతున్నారు కవులు—అని
విచారించి
ఈ లేబొరేటరీలో కూచుని
లోకంనిండా విరివిగా కాంతి వందేరితని
కొత్తరకం వి త్తనాల్ని కనిపెట్టే పీలున్నది-అని
గ్రహిస్తాడు
అవి అన్నీ కల్పించే అమృతఘటిక కోవరమై
నిరీక్షించు మానవునికి త్వరగా పలమందించే
మార్గా నన్వేషించమని—ఆయన లేబొరేటరీకి,
మతనపడే మేధావుల శిథిలాశలు చివురించే
రస రాజ్యం, లేబొరేటరికి రమ్మంటారు

ఈ రచనలో సౌందర్యంతోపాటు సంబోధం కనిపిస్తుంది స్పష్టసత్యాలతోపాటు సందేశాలు వినిపిస్తాయి సంప్రదాయ కల్పనలతోపాటు సరి కొత్త రూపచిత్రాలు గోచరిస్తాయి నిరాశగాని నిరుత్సాహంగాని లేవు. ఆశతో తాను అపురూప హర్మ్యాలు నిర్మించి—తనతోపాటు అందరినీ తప్పక రమ్మంటారు ఉత్సాహవాదంతో ముందుకి పురిగొల్పుతారు

—తెలుగు స్వతంత్ర (1 ఏప్రిల్ 53)


ఉచిత

JAI HIND WATCH Co.
P. B. 97 SITLA TEMPLE AMRITSAR


—❖❖❖—

# సౌభాగ్య

గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలో ఒక అంశమైన మహిళాభ్యుదయాన్ని సాధించే ఉద్దేశంతో భారతదేశంలో ఓం ప్రథమంగా మదరాసు ప్రభుత్వం స్త్రీ జనాభ్యుదయశాఖను స్థాపించింది

స్త్రీల విజ్ఞాన వికాసాలకు దోహద మిచ్చే రచనలతో "సౌభాగ్య" అనే సచిత్ర మాసపత్రిక ప్రచురింపబడుతున్నది సాంఘిక సంక్షేమం "సౌభాగ్య" ఆశయం

అందరికీ అందుబాటులో ఉండేటట్లు విడిప్రతి వెల 3 అణాలు సాలు చందా (పోస్టేజీతో సహా) రెండు రూపాయలు ఏర్పాటు చేయబడింది

"సౌభాగ్య" ప్రతులకు స్త్రీ జనాభ్యుదయశాఖను గురించిన ఇతర వివరాలకు ఈ క్రింది చిరునామాకు వ్రాయండి

ఎడిటర్: "సౌభాగ్య"

7, ఆరాముడు గార్డెన్ స్ట్రీట్, ఎగ్మూరు, మద్రాసు—8

---

సం॥ చందా రూ.6-0-0

# వినోదిని

విడి ప్రతి రూ.0-8-0

(నవ్వుల మాసపత్రిక)

ఇరవై యేండ్లుగ నిర్విఘ్నంగా సాగుతూ తెలుగుదేశానికి యథోచితంగా సేవచేస్తున్నది ఈ ఇరవై ఒకటవ సంవత్సరంలో సర్వాంగసుందరంగా వెల్వరించేందుకు కృషిచేస్తున్నాం మా యీ కృషికి పాఠకులు రచయితలు చిత్రకారులు తోడ్పడ ప్రార్థిస్తున్నాం

ఏజెంట్లు లేనిచోట్ల ఏజెంట్లు కావాలి

వివరములకు

వినోదినీ కార్యాలయం,

33, జోన్సు వీధి, జి టి మద్రాసు

# యమునాతీరం

పి ఎస్ ఆర్ అప్పారావు, ఎం. ఏ

గోపాలుడు కృష్ణయ్యా! ఆనవాలేయ్ కావేవు నీ ముఖ! నీగోల నీదేకాని గోకులంలోని గోపికలంతా మనపై కట్టుకట్టినట్లు తోస్తోంది ఏమైనా వివిపించుకొంటు న్నావా?

కృ (మురళినాపి) ఆదేమిటోయ్ గోపాలా!

గోపా ఏమిటా? నీవేమో అత్తను లేవ దీసికొనిపోవాలని చూస్తున్నావట ఇంక గోకులంలో ఆడది మావంతో బ్రతకటానికే వీలులేదట

కృ ఎవరా చెప్పిన చవట!

గోపా ఎవరా? ఎవరేమిటి? మీమామే గోకులంలోని గొల్లభామలందరికి నూరి పోస్తున్నాడు

కృ మామ ఊళ్లోనే ఉన్నాడా యేమిటి?

గోపా ఆహా! మధ్యాహ్నమే వచ్చాడట! ఉద్యోగానికి నాల్గురోజులు సెలవుపెట్టి

కృ సరి సరి. ఈయన ఉద్యోగానికి సెలవులుకూడానా?

గోపా గుణ్ణం గుడ్డిదైనా దానాకు లోవ మేమిటి?

కృ: సరేకాని, గోపాలా, రాధ వస్తోం దేమో చూడు ఎప్పుడూ ఇంత ఆలశ్యం చెయ్యలేదే ఈనా డెందుచేతనో ఇంత జాగుచేస్తోంది

గోపా ఈవాళ ఇల్లు కదలడానికి వీలు లేకుండా మామ యేమైనా మారాంపెడుతు న్నాడేమో

కృ అది వాడితరం కాదులే కాని, గోపాలా, మామ వట్టి అమాయకుడుకాదూ?

గోపా అదే నేను చెప్పేదీని మామ అమాయకుడు కాకపోతే నీ ఆట లెలా సాగు తాయ్ బాబు

కృ (వినిపించుకోకుండా) మామకు నే నంటే మహమంటోయ్

గోపా అయితేయేం? వర్ధించేది మన పైనే కదటంతిని రూరొప్పుతున్నారు అత్తకు నీపైన పరిపూర్ణాభిమానమే కదా?

కృ నీవేదో కవిత్వం కదుతున్నట్లు న్నావే?

గోపా: కవిత్వం కట్టడంమాట యేమో కాని పెళ్లి ముందు మామకు రక్షరేకుకట్టాలి

కృ అదెందుకోయ్!

గోపా అత్త యిక్కడికి వచ్చాక మామ ఒంటరిగా ఉంటే జడుసుకోడూ?

కృ నిజంగా వెడితే నీ భరతంపడతాడు సుమా మామ చాలా అసాధ్యుడు

గోపా నీకు మామతో అనుభవం చాలా ఉన్నట్లు మాట్లాడుతున్నావే సరేగాని నీకు శుభవార్త చెప్పితే ఏమిస్తావు?

కృ ఏమి టది?

గోపా అదిగో అత్త వస్తోంది ఘుమ ఘుమలాడుతూ

కృ ఛీ! అత్తయేమిటి మునలి ముత్తైదు వును పిలిచినట్లు

గోపా అబ్బో! చాలా దూరం దాగా ఉందే కృష్ణయ్యగారి అభిమానం? అది సరేకాని శుభవార్త చెప్పినందులకు ఛీ ఛీలా నాకు పారితోషికం? అసలు మామపెళ్లాం అత్తకాక యేమవుతుంది?

కృ: ఆమాటంటే నాకసహ్యం రాధ మనసారా మామను పెళ్ళిచేసికొనేలేదు ఈ బలవంతబాంధవ్యంచేత ఇద్దర్నీ భార్యాభర్త లంటుంది ప్రపంచం దానికి బుద్ధి యేమైనా ఉందా?

గోపా అవిషయం నీకే తెలియాలి బాబు పెళ్లప్పుడు నీవంటివాళ్లుంటారని మామ మర్చిపోయుంటాడు

కృ దానికిప్పు డనుభవిస్తారులే ఈడూ జోడూ అయ్యి మాయిద్దర్నీచూసి ఓర్వలేక పోతే, ఇదిగో ఈయేట్లో దూకుతాడు

గోపా అదిగో రాధ దగ్గరకు వచ్చే సింది ఇంక సెలవు నేను

కృ మంచిది

(గోపాలుడు నిష్క్రమించును రాధ దూరముగా ప్రవేశము)

రాధ: (పాట)

ఏటిఒడ్డున వేగిరపడుచు ఎదురుచూచే
గోపాలా, గోపాలా!
చీకటిలోన చెట్లచాటున కలిసిపోదా
హోయ్ కలిసిపోదాహోయ్!
కన్నుతెలియని చిమ్మచీకటి నిన్ కను
గొనలేనోయ్ నీపై కనరావేహోయ్ ॥ఏ॥

కృష్ణా! కృష్ణా! ఎక్కడనోయి అలవ్య మైందని అలిగినావా? దొంగలా చీకట్లో దాగిపోతావు ఎక్కడ నిన్ను పట్టుకోనూ

కృ (చాటున ఉండి) రాధా! రాధా!

రాధ ఎక్కడ కృష్ణా! అయ్యో! ఎంత ఆత్రంతో వచ్చానో అంత ఆలశ్యమూ చేస్తావుకదా?

కృ ఎంత ఆత్రంతో ఎదురు చూచానో అంత అలవ్యంగానూ నవ్వు రాలేదా?

రాధ అదే క్షమించమంటున్నాను కృష్ణ ప్రభూ!

కృ కాను క్షమించమంటం మరువే ఇంత సేపటినుంచీ ఈ కటికిచీకట్లో, ఒక్కర్తే?

రాధ ఒక్కడివేమిటి? గోపాలుడు రాలేదా?

కృ మామ దగ్గరికి వెళ్ళాడు నీవు లేనప్పుడు జరుసుకోకుండా రక్షరేఖ కట్టడానికి

రాధ (నవ్వి) మురదర ప్రియ స్నేహితుడికి కట్టివెళ్ళలేకపోయాడా?

కృ (సగర్వంగా) మనకటువంటి భయాలేమీ లేవు

రాధ మరి యీ కటికచీకట్లో, ఇంత సేపటినుండీ, ఒక్కర్తే అనీ యీ దీనాలాపాలెందుకో

కృ ఓస్ మాటవరుసకలా అన్నాను గాని భయం నన్ను జూచి పారిపోవలసిందే దాని పప్పులు మనదగ్గర ఉడకవ్

రాధ అయితే నన్నుగూర్చి నీవేమీ ఆత్రపడలేదన్నమాట

కృ అబ్బె బ్బె అదా అర్థం? ఏది మాట్లాడినా నీతో తగవుగానే ఉందే

రాధ కృష్ణా! నామాట యేమోకాని ఇంతశ్రమపడి వచ్చాను నీవు మాత్రం తగువులు, మారాములు పెట్టకేం

కృ కాను తగువులు మారాములు పెట్టేది నేనా? లేక మామా?

రాధ (జాలిగా) కృష్ణా! ఇంకా ఎంత ఆలశ్యమోయి? ఇంకా చెట్లచాటునేనా? ఇప్పటికేనా నీకు దయరాదా?

కృ (దగ్గరకు వచ్చి) క్షమించు రాధా! నీ మనస్సునకు బాధ కలిగించాను

రాధ (కృష్ణుని పట్టుకొని కౌగిలిలో నలిపివైచుచు) విశ్వనాథుడవగు నిన్ను నే నటోయి క్షమించునది? కృష్ణా! ఏదీ వేణువు నొకసారి పలికించవా?

కృ రాధా! నేనంటే నీకంత ప్రేమ ఎందులకు?

రాధ అదే నేనూ తెలుసుకోలేక పోతున్నాను నీవేమైనా చెప్పగలవా?

కృ (కొంటెగా) మామమీద కూడ నీకింత ప్రేమ ఉందా?

రాధ: కృష్ణా! నన్ను పరీక్షిస్తున్నావా?

కృ లేదు రాధా! కాని ఒకవేళ లోకమే నిన్ను పరీక్షిస్తుందనుకో

రాధ లోకముతో నాకేమి పని కృష్ణా! నీవెళ్ళప్పుడు మాత్రం నావద్దనున్నచో నాకు చాలును

కృ (హేళనగా) అవును ఇంక నాకేమి పనివున్నది నీవు కాక నాకింకెవ్వరున్నారు? ఎల్లప్పుడు నీతోనేనే

రాధ అవును స్వామీ! నీకుకూడ నే నున్నచో పరిహాసమే నాఅంతట నేనువలచి వచ్చినదానను నా ప్రేమకు విలువ అంతకంటె మరేముంటుంది?

కృ అంతమాత్రమునకే కోపమా రాధా!

రాధ నాకు కోపముకూడానా కృష్ణా! గృహమును భర్తను బంధుగులను నా సర్వస్వమును విడిచివచ్చి నీ పాదదాసిని మాత్రమే కాగోరుచున్నదానను నేను నీవో? బహువ్యాపకుడవు నేను నీకొక లెక్కయా?

కృ మాటలతో నా హృదయాన్ని కుతకుత ఉడికించివేస్తున్నావు రాధా!

రాధ ప్రభూ! నీ మనస్సునకు కష్టం కలిగించటం నా ఉద్దేశంకాదు నా అసహాయత్వాన్ని మాత్రమే వెళ్ళబోసికొన్నాను

కృ (రాధను కౌగిలిలోనికి దీసికొనుచు) రాధా! నీకేమైనా వెర్రిపట్టలేదుగదా? నన్నే శంకిస్తున్నావా?

రాధ (గాద్గద్యముతో) లేదు స్వామీ! ముమ్మాటికి నిన్ను శంకించటం లేదు నాది చపలహృదయం ఏమేమో మాట్లాడుతాను

కృ రాధా! ఈనాడింత వేలపైనా వేమిటి? ఈ రాధాకృష్ణునిలో ఏనాడైనా అన్యభావాన్ని గుర్తించావా?

రాధ లేదు ప్రభూ! నీవిప్పుడు ఉచ్చరించిన పదమువలెనే మనమిరువురముకూడ జంటబాయక ఎల్లప్పుడును కలిసివుండాలని నా కోరిక

కృ ఇప్పుడు లేమా?

రాధ నిత్యమూ ఇలాగే ఉండిపోవాలి కృష్ణా! నిన్ను విడిచి నేనింక ఒక్కక్షణమైనా ఉండలేను ఈ మధురస్థలంనుండి నేను తిరిగి గోకులంలో అడుగుపెట్టలేను పెట్టానా నేను తిరిగి యింకరాలేనేమో

కృ అలాకాదు రాధా! కొంచెం ఓర్పు వహించాలి

రాధ నాతరముకాదు కృష్ణా! నీ స్పర్శలేని క్షణాలన్నీ నన్ను అపాదమస్తకము దహించివేస్తున్నాయి

కృ రాధా! నీవు భర్తచాటుదానవు నేనో, ఇంకా తల్లిదండ్రుల చాటువాణ్ణి మరి నేను స్వతంత్రుణ్ణి అయ్యేవరకూ వేచి ఉండాలి

రాధ అంతవరకు ఈ ప్రాణాలను భరించలేనోయి కృష్ణా!

కృ (ప్రసంగం మార్చే ధోరణిలో) రాధా! అటుచూడు చంద్రుడిప్పుడే ఉదయిస్తున్నాడు

రాధ కృష్ణా! నన్ను మురిపిస్తున్నావు

కృ (వినిపించుకోనట్లుండే ధోరణిలో) చంద్రుడేంకో అంతకాంతివంతముగా లేడు బహుశా వికసించిన రాధాదేవి ముఖపద్మాన్ని జూచి ఇది రాత్రివేళ కాదని తిరిగి అస్తమించే ప్రయత్నంలో ఉన్నాడేమో?

రాధ కృష్ణా నీవేదో ఊహాప్రపంచంలోకి పోతున్నావు అక్కడికివచ్చే అర్హత నాకు లేదేమో

కృ రాధా! అన్నీ నీకు అనుమానాలే నేను ఎక్కడ ఉంటే అక్కడే నీవూ ఉంటావు నాతో నీవు రాలేనిచోటే లేదు ఈ విశాలప్రపంచంలో

రాధ నిజముగానా కృష్ణా!

కృ నిజముగానే రాధా! ఎడబాయని జంటగా ఆదర్శప్రేమైక జీవులుగా రాధాకృష్ణుల పేర్లు ఆచంద్రార్కం నిలిచి ఉంటాయి

రాధ ధన్యోస్మి కృష్ణా! ధన్యోస్మి ఇదిగో కృష్ణా! నీకై వెన్న పట్టుకొని వచ్చాను

కృ (ఆత్రంతో తీసికొని చప్పరిస్తూ)

ఇంతసేపూ చెప్పావు కాదేం రాధా! ఇందాకటినుంచీ మంచి ఆకలివేసిపోయింది

రాధ తనివితీరా తిను కృష్ణా! నీ చిఱుబొజ్జ నిండిపోవాలి కావలసినంత పట్టుకొని వచ్చాను

కృ నీదగ్గర ఉన్నదేమిటా యని ఇందాకటినుండీ ఆలోచించనేలేదు సుమా

రాధ ఇప్పుడు వచ్చిన నష్టం ఏమిటి?

కృ అబ్బె ఏమీ లేదు ఇప్పటికి కొంత జఠరాగ్ని వ్యర్థమైపోయిందికదా అని

రాధ కృష్ణా! నీవు విచిత్రమైన వాడవు సుమా నీచేతలు పలుకులు ఒక పట్టున అర్థంగావు

కృ అదే వచ్చినబాధ నన్నర్థం చేసికోలేక నాపై లేనిపోని నిందలు మోపుతారు

రాధ నీపై నిందలుమోపే వారెవ్వరు? అంత ధైర్యమా?

కృ అంత ధైర్యమా? ఇంతధైర్యమా! నేనట రాధనట లేవదీసుకొనిపోతానట మామను పెళ్ళివాణ్ణి చేసి

రాధ ఎవరన్నారు కృష్ణా!

కృ ఎవరా? గోకులంలోనివారంతా

రాధ అనింద నీకెందులకు కృష్ణా! నేనే భరిస్తాను లేచివచ్చినదానను నేనే

కృ అది గోకులానికేం తెలుస్తుంది వన్నాదిపోసుకుంటోంది మానవతులను బ్రతుకనీయదని

రాధ ఇంతమాత్రమునకే మానవతులింక బ్రతుకరా? నేను గోకుల మిల్లిల్లు తిరిగి నా కృష్ణస్వామి నిర్దోషియని ఘోషించి వస్తాను

కృ లేచిరావటమేకాకుండా ఇదొకటా? ఎంతకైనా తెగించినట్లున్నావు

రాధ: ప్రభూ! నన్నింతా పరీక్షిస్తున్నట్లున్నావు నేను మానవతినని ప్రపంచం ఒప్పుకోవచ్చును కాని నేను మానవతినేయని నీకు మాత్రం తెలియకపోలేదు నాకు ఊహ వచ్చినప్పటినుండియు త్రికాలములందును నీధ్యానతక్క నేను అన్యభావన యెఱుగను. అసలు నా జన్మకారణము నీ పాదసేవార్థమేనేమో! మన యీ సంబంధము జన్మపరంపరాసిద్ధమని నా నిశ్చితాభిప్రాయము ఏనాపాపము వలననో మధ్య నీనడుమంతరపు వివాహము వచ్చిపడినది

కృ (అనునయిస్తూ) ఖేదపడకు రాధా! నిజాన్ని నిలకడమీద ప్రపంచం తెలిసికొంటుంది ఆత్మవంచన లేకుండా నిర్మలమనస్సుతో చేసే పనులకు ప్రపంచామోదాన్ని పొందనక్కఱలేదు

రాధ కృష్ణా! నీవొక్కడవు నన్నాదరిస్తే నాకు చాలు మరేమీ నాకిక అక్కఱలేదు

కృ రాధా! నన్ను విశ్వసించు

రాధ అవిశ్వాసమునకు తావేలేదు కృష్ణా! నేను నీ దేహచ్ఛాయవంటిదానను

కృ రాధా! వెన్నెల ఈవనమునంతను కాంతివంతము చేసివేసినది ప్రకృతి ఎంత రమణీయముగానుందో చూడు

రాధ: అటుచూడు కృష్ణా! చంద్రబింబం నీటి యలలలో ఆటలాడుకొంటోంది చూడ ముచ్చటగా

కృ తెకతేరవిచ్చిన పుష్పములు సువాసనలతోగూడి పిల్లగాలుల హృదయానికి మత్తును కలిగిస్తున్నవి రాధా!

రాధ చింతలనన్నిటినీ మఱపించే యీ ప్రశాంతత్వం ఎంతయు లోభనీయముగానున్నది

కృ శృంగారములోనుండి వైరాగ్యములోనికి వెడుతున్నావు రాధా!

రాధ నేను తెలివితక్కువగా వెడుతున్నా కృష్ణసాన్నిధ్యం నన్ను అనుక్షణం అరికట్టుతూనే ఉంటుంది

కృ రాధా, నీ వయస్సు ఎంత?

రాధ అల్లా అడుగుతున్నావేం?

కృ అబ్బె ఏమీలేదు నీకెంత అనుభవం ఉందో అని

రాధ: నీవు నేర్పినమాత్రమే

కృ: సరి సరి అదికూడ నామీదికే వచ్చినదా?

రాధ నీవు తప్ప వేరు ప్రపంచం నాకు తెలియదు కృష్ణా! అందుచే నాకున్న గుణాలు నీవు నేర్పినవైయుండాలి లేదా నీ దర్శనమాత్రాన నాలో ఉద్భవించి ఉండాలి

కృ అదికాదు రాధా! నీవు నాకంటె పెద్దదానవని అందరూ అనుకోరూ?

రాధ అయితే మాత్రం తప్పేమిటి? కాని, కృష్ణా! నేను నీకంటె పెద్దదానను కాను అత్త వరసవలన వచ్చిన అపఖ్యాతయిది

కృ (కొంటెగా) అంతేనా? నిజంగా పెద్దదానవేమో అనుకొన్నాను

రాధ అమ్మయ్య ఇప్పటికైనా బెంగ తీరిందా?

కృ కాని రాధా! నీయెదుట నెనెంతో చిన్నవాడిలా కన్పిస్తాను తయా?

రాధ కృష్ణా! నీవు నిత్యయౌవనుడవు అవ్యయానందమూర్తివి నేనో వయస్సునకు తగని వ్యథతో వికృతాకారమగుచున్నాను అందులకే మనమధ్య విశేషభేదం కన్పిస్తోంది

కృ: ఇంక వ్యథ యెందులకు? వికృతాకారమెందులకు? రాధా! మన జంట యింక అవిభాజ్యము మన నామాక్షరాలతోబాటు ప్రతి ప్రణయజీవిచే ఈ పవిత్ర యమునా తీరంకూడ స్మరించబడుతూంటుంది ఏదీ రాధా! ఒక చిరునవ్వు ఒక ముద్దు

రాధ (చిఱునగవుతో ముద్దిడును)

పాట ఆహా రాధా ప్రణయమే ధన్యము

కృ పాట రాధామాధవులే మధుర జీవులు

రాధ, కృ (పాట)

రాధా మాధవులే మధుర జీవులు

[కృష్ణుని వేణుగానం]

# భారతీయ సంగీత ప్రాశస్త్యం

యహూదీ మెనూహిన్

ప్రధానమంత్రి నెహ్రూ ఆహ్వానంమీద గత సంవత్సరం ఆరువారాలు భారతదేశంలో సంచారం చేశాను ఆక్కడ ఆత్మ సంతృప్తి కలిగించే ఎన్నో నూతన విషయాలు నాకు కనిపించాయి జీవన సామరస్యం ఇతర దేశాలలోకన్న భారతదేశంలో ఎక్కువగా ఉన్నదని పాశ్చాత్య దేశాలలోకన్న మనస్సుకీ హృదయానికీ భారతదేశంలో ఎక్కువ సామరస్యం ఉన్నదనీ నా అభిప్రాయం

యూరోపు దేశాల సామ్రాజ్య వాదంనుంచి విముక్తి పొందడం వల్ల భారతదేశంలో ఇప్పుడు పాశ్చాత్య జీవన విధానంలోని కొన్ని విషయాలలో పూర్వంలేని శ్రద్ధ ఉద్భూతమయింది అలాంటి విషయాల్లో పాశ్చాత్య సంగీతం ఒకటి వేలకొలది భారతీయులు యూరోపులో విద్యాభ్యాసం చేయడం మూలంగా వారికి పాశ్చాత్య సంగీతంతో కొంత పరిచయం కలిగింది కాని ఆ దేశంలోని కోట్లకొలది ప్రజానీకంలో వీరి సంఖ్య అత్యల్పమైనది నిజంగా ఇందులో విచారించవలసినదేమీ లేదు భారతీయ సంగీతము భారత సంస్కృతి భారతీయ తత్త్వశాస్త్రము సంప్రదాయాలు ఇతర దేశాల సంస్కృతులపైన అణుమాత్రం కూడా ఆధారపడినవికావు అవి సమగ్రవికాసం పొందినవి స్వయం సంపూర్ణత గలవి భారత దేశానికే కాక, ఇతరులు కూడా అవలంబిస్తే, ప్రపంచమంతకి కూడా ఉపకరించగలవి

భారత పాశ్చాత్య సంగీతాల మధ్య నాకు కనిపించిన భిన్నత ఇది భారతీయ సంగీతం సంప్రదాయ బద్ధమైన విస్పష్టమైన భావ ప్రకటన విధానం దానిలో సంగీతకులు శ్రోతలు కూడా పరిసరాలను అదృష్టశక్తినీ పూర్తిగా విస్మరిస్తారు అది భావమయమైనది ధ్యానదృష్టి కలది ప్రశాంత స్వభావం గలది ఆ ప్రశాంతిని భ్రష్టం చేసే ఆవేశానికి రౌద్రానికి భిన్న భావసమ్మేళనానికి దానిలో స్థానం లేదు శ్రోత ధ్యాననిమగ్నుడై భగవంతునితో లీనమైపోవడానికి అది తోడ్పడుతుంది

ఇక, పాశ్చాత్య సంగీతంలో సంగీత రచయిత వ్యక్తిత్వం ప్రదర్శకుని వ్యక్తిత్వం స్పష్టంగా వ్యక్తమవుతుంది ఆ సంగీత ప్రభావంవల్ల శ్రోతలలో ప్రతివాని వ్యక్తిత్వం మేల్కొంటుంది తాను కూడా అలాగే తనజీవిత పరిసరాలతో అదృష్టశక్తులతో పోరాడి విజయం సాధించాలనే సంకల్పాన్ని అతనిలో ఉద్బుద్ధం చేస్తుంది

అందువల్ల, పాశ్చాత్య సంగీతం ప్రాచ్య దేశాలలోని శ్రోతలను ఎందుకు ఆకర్షిస్తున్నదీ మనం తేలికగా అర్థం చేసుకోవచ్చు నా భారతదేశ యాత్రలో సర్వత్ర వారి అభీష్టాన్ని తీర్చడానికి నేను తీవ్రంగా ప్రయత్నంచేశాను ఇండియాలో మన విదేశ శాఖోద్యోగులు బ్రిటిష్ ఉద్యోగులు భారత ప్రధానమంత్రి కోరినందువల్లను నన్ను విశేషంగా ఆకర్షించిన ఆ దేశం జీవన పూర్ణతను సాధించుకొనడానికి యథాశక్తి తోడ్పడవలెననే స్వసంకల్పంవల్లను భారత యాత్రలో నాకుగల అనుభవాల ఆధారంపై కొన్ని సూచనలు చేస్తున్నాను

ముఖ్యంగా, భారత జాతికంతటికీ ఒక పాశ్చాత్య సంగీత వ్యవస్థ ఏర్పరచుకొనడం అవసరమని నా అభిప్రాయం పాశ్చాత్య దేశాలలో మేము విదేశీ కళల అభివృద్ధికి ఏర్పరచుకొన్న వ్యవస్థల నమూనాలలోనే దీన్ని నిర్మించుకోవాలి ఉదాహరణకు గ్రీకు నాటక కళ మన జాతీయ నాటక కళ స్థానాన్ని ఆక్రమించలేదని మనకి తెలుసు అయినా ఆ కళను మనం పోషిస్తున్నాం అలాగే భారతీయులు కూడా పాశ్చాత్య గానకళను అభ్యసించవచ్చును భారత దేశానికి అంతటికీ అవసరమైన సంగీత ప్రదర్శకులను ఆచార్యులను అధ్యాపకులను ఆ సంస్థే తయారు చేయవలసి ఉంటుంది ప్రస్తుతానికి ఇండియాకు ఇట్టి సంస్థ ఒక్కటి ఉంటే చాలు ఈ ప్రయత్నంలోని విస్తృతికిగాక గుణానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం అవసరం ఆ సంస్థ భారతీయ డైరెక్టరు యాజమాన్యాన యూరప్ అమెరికా విద్వాంసుల సహకారంతో నడుపబడాలి దానికి అనుబంధంగా వెనువెంటనే ఒక ఉత్తమ జాతీయ వాద్య సమ్మేళనాన్ని కూడా ఏర్పరచాలి ఆ వాద్య సమ్మేళనం ఆర్కెస్ట్రా ఇండియా అంతట సంచారంచేసి ప్రదర్శనలిస్తూ పాశ్చాత్య సంగీతం పట్ల భారతీయులలో కలిగించబడుతూన్న అపోహలను తొలగించాలి

అలాగే పాశ్చాత్యులు భారతీయ గాయకుల సంగీతాదర్శాన్ని లయతో వారికి గల సునిశితజ్ఞానాన్ని మధురస్వర కల్పనలలో వారి స్వేచ్ఛను అలవరచుకొనడంవల్ల చాలా ప్రయోజనం ఉంటుంది

సంగీతకులు అసామాన్య మాధుర్య శిఖరాల నందుకున్నప్పుడల్లా శ్రోతలు తమ హర్షాన్ని వెల్లడించే భారతీయ సంప్రదాయం ప్రపంచంలో ఏ సంగీత ప్రదర్శకుడికైనా అద్భుతమైన ప్రోత్సాహ హేతువవుతుంది

మొత్తంమీద పాశ్చాత్య సంగీతం భారతీయులకు, భారతీయ సంగీతం పాశ్చాత్య దేశాలకు పరిచయం అవడం ఉభయత్రా శ్రేయోదాయకం కాగలదు




## హైద్రాబాదు రాష్ట్రంలో చిత్రనిర్మాణకేంద్ర స్థాపన

"భారత పిక్చర్స్ లిమిటెడ్ హైద్రాబాదు" నిర్మాణ సందర్భంగా తిలక్ మెమోరియల్ హాలులో జరిగిన 27 వ మార్చి 1953 నాటి సమావేశానికి హైద్రాబాదు ముఖ్యమంత్రి గా శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు అధ్యక్షత వహించారు

ఈ సమావేశానికి పురప్రముఖులు కళావేత్తలు నటీనటులు, పత్రికారచయితలు వ్యాపారస్థులు ప్రభుత్వోద్యోగులు విచ్చేశారు ఈ కృషిలో ప్రత్యేకంగా సారధ్యంవహిస్తున్న భారత్ పిక్చర్స్ లిమిటెడ్—ఎడ్‌హాక్ కమిటీ కార్యదర్శి శ్రీ కొండా లక్ష్మణ్ యం యల్ ఎ అధ్యక్షులు శ్రీ రాజా బదరీవిశాల్ పిట్టీ అడ్‌హాక్ కమిటీ సభ్యులు మిలాప్ పత్రికాసంపాదకులు శ్రీ యుద్ధవీర్ శ్రీ కర్పన్‌బాబు శ్రీ ఎర్రం సత్యనారాయణ శ్రీ టి రంగారెడ్డి శ్రీ కొత్తూరు సీతయ్య శ్రీ ఎ బి ఓమర్ ప్రసిద్ధ చిత్రరచయిత శ్రీ గిడుతూరి సూర్యం శ్రీ యం నరసింహారావుగార్లు ముఖ్యమంత్రిని భారత్ పిక్చర్స్ లిమిటెడ్ ఉపాధ్యక్షులు ప్రసిద్ధ చిత్ర నిర్మాతలు యీ సంస్థ ప్రారంభకులు అయిన శ్రీ చిత్తూరి వి నాగయ్యగారిని పుష్పమాలాంకృతుల చేశారు ప్రధాన మంత్రికి కుడివరుసన ప్రముఖులు శ్రీ అరవముదు అయ్యంగారు ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావుగార్లు ఆశీనులై వున్నారు

భారత్ పిక్చర్స్ లిమిటెడ్ కార్యదర్శి శ్రీ కొండా లక్ష్మణ్ గారు ముఖ్యంగా హైద్రాబాదు రాష్ట్రంలో యెంతోకాలంనుంచి ఒక చిత్రనిర్మాణ కేంద్రం ఒక ఫిల్ము సంస్థ నెలకొల్పాలని ఆకాంక్షించ బడుతున్నప్పటికీ అప్పటిలో వ్యాపారమాంద్య కారణంగా ఈకృషి ఆకృతి ధరించలేకన్నారు అయినా శ్రీ లక్ష్మణ్ గారి ప్రోత్సాహంతో శ్రీ గిడుతూరి సూర్యంగారు చిత్రరచన నిర్మాణాలలో అనుభవాన్ని గడించుకోవడానికి మద్రాసుకు పంపబడడం జరిగిందనీ అట్టి కళాకారులు స్థానిక నటీనటులు యిట్టి కృషిలో ప్రగమనశీలంగా కృషి చెయ్యడానికి వుత్సహిస్తున్నారని, యీ సంస్థకు కళాకారులు రాజకీయ సామాజికక్షేత్రాల దేశశ్రేయస్సును ఆకాంక్షిస్తూ పనిచేస్తున్న విజ్ఞుల తోడ్పాటు లభిస్తున్నదని ముఖ్యంగా రాష్ట్ర ముఖ్యమంత్రి మార్గదర్శక ప్రోత్సాహ సలహా సహకారములతో, చిత్రనిర్మాణాలలో నేతృత్వం వహిస్తున్న ప్రముఖ దక్షిణ భారత కళావేత్త శ్రీ చిత్తూరి వి నాగయ్యగారి అవిరళ సహకారంతో యీ కృషి ప్రారంభమై ప్రజాహృదయాన్ని చూరగొనగలుగుతుం దని చెప్పారు

భారత్ పిక్చర్స్ లిమిటెడ్ పక్షంగా శ్రీ లక్ష్మణ్‌గారు కోరినట్టు శ్రీ నాగయ్యగారు యీ సంస్థను ప్రారంభిస్తూ "ఈ హైద్రాబాదు రాష్ట్రం యెంతో రమణీయ ప్రకృతిశోభ కలిగివున్నందున, చరిత్రాత్మక ప్రముఖస్థలాల కలిగివున్నందున యిక్కడ చిత్రనిర్మాణానికి యెంతో సౌలభ్యం వున్నది యిక్కడగనుక ఒక చిత్ర నిర్మాణకేంద్రం ఒక స్టుడియో నిర్మితమైతే ప్రజలలో విజ్ఞాన వ్యాప్తికి సామాజికాభ్యుదయానికి దోహదంచేస్తూ ప్రాంతీయాభివృద్ధికి తోడ్పడే చిత్రాలు తీయవచ్చు పైగా యీ పరిశ్రమకు యీ రాష్ట్రం కావలమైతే—స్థానిక నటీనటులకు గాయకులకు, సాంకేతికప్రవీణులకు వుత్తమావకాశాలు కల్పించవచ్చు క్రమంగా యిది అనేకులకు ఆర్థికోపాధి కల్పిస్తుంది అంతేగాక విద్యార్థులకు బాలబాలికలకు వుపయోగకరంగా వుండు విద్యావిషయక చిత్రాలను తీయవచ్చు చిత్రాలు దేశాభ్యున్నతికి వుత్తమసాంస్కృతిక పోషానాల నిర్మించగలిగిన సాధనలు" అన్నారు కాబట్టి శ్రీ నాగయ్యగారు ప్రాంతీయ ప్రజానాయకులు రాష్ట్రప్రభుత్వసారధులు యీ కృషికి దోహదం చెయ్యాలన్నారు ఈ రోజే శ్రీ నాగయ్యగారి జన్మదినోత్సవం కావడంతో యీ సందర్భంగా వారికి ప్రత్యేకంగా పుష్పమాలలు ప్రేమపురస్సరంగా సమర్పించబడినవి

సభాధ్యక్షులు గా శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు అధ్యక్షోపన్యాసంలో చిత్రాలను, చిత్రపరిశ్రమను సమీక్షిస్తూ, "చిత్రాలు

విద్యలేనివారిని విద్యావంతులు చేయడానికి యెంతో వుపకరిస్తాయి అందుచేతనే బొమ్మద్వారా శబ్దంద్వారా విద్యగరపడం యెంతో సులభంగా వుంటుందనే—"పంచవర్ష ప్రణాళిక"లో దీనికి యెంతో ప్రాముఖ్యం యివ్వడం జరిగింది దక్షిణ, ఉత్తర భారతాలకు కేంద్రంగా ఒక సాంస్కృతిక వినూత్నవేదికగావున్న యీ రాష్ట్రంలో యీ కృషి యెంతగానో రాణించవలసియున్నది విదేశాలలోలాగే యీ పరిశ్రమ యిక్కడ యెంతో అభివృద్ధిచెంద వలసియున్నది పైగా చిత్రాల విలువనుకూడా యెంతో పెంచి ప్రమాణాన్ని కళావిషయకంగా వున్నతస్థాయికి తీసుకరావాలి ఇక్కడఅయితే యీ కృషికి యితఃపూర్వం అంకురార్పణ జరిగి కొన్ని స్టుడియోలు నెలకొల్పబడినవి కొంత ఆవి పనిచేసి కార ణాంతరాలవల్ల నిలిచిపోయినవి భారతదేశంలోని వివిధరాష్ట్రాల సంస్కృతిని సమహారంలో కూర్చడానికి చిత్రనిర్మాణం యెంతో ఉపకరిస్తుంది ఇక్కడ ప్రతిభావంతులైన కళాకారులుకూడా ఉన్నారు సర్వసమృద్ధంగా యీ అవకాశాలను వినియోగించుకొని యీ సంస్థ ఉజ్జ్వల భవిష్యత్తును ధరించి—దేశహితైకతత్పరతతో ప్రగమిస్తుందని నేను ఆశిస్తున్నాను చిత్రాలు ప్రజాహితాన్ని కోరుతూ ప్రజాహృదయాన్ని చూరగొనగలిగేవిగా నిర్మాణంకావా లని నా కోర్కె శ్రీ నాగయ్యగారివంటి కళాప్రౌఢిప్రియం భావకుల మార్గదర్శక సహకారంతో యీ సంస్థ ప్రగతిశీల చిత్రాలుతీసి— జనతాహృదయాన్ని చూరగొనగలదని విశ్వసిస్తున్నాను" అని హర్ష ధ్వానాల మధ్య తమ ప్రసంగాన్ని ముగించారు కార్యదర్శి శ్రీ లక్ష్మణ్‌గారి కృతజ్ఞతాభివందనములతో యీ ప్రారంభోత్సవం పరిసమాప్తమైంది


ఉచితము

కాశ్మీరీ శాస్త్రం



ఇదుగో మీకు కావలసిన పుస్తకం ఇందులో స్త్రీ. పురుషుల రంగుల ఫొటోలు 284 ఉన్నవి ప్రకటన ఖర్చులకుగాను 8 అణాలు పంపుతూ ఫ్రీ కాపీకి వ్రాయండి త్వరపడండి లేనియెడల మీ అవకాశం పోగొట్టుకొనగలరు

Paris Art House Halqa 5 (D—304) AMRITASAR



చదవండి!

ఆంధ్రమహిళ

(స్త్రీల సచిత్ర మాసపత్రిక)

వ్యవస్థాపకురాలు శ్రీమతి దుర్గాబాయి ఎం ఏ బి ఎల్
సంపాదకురాలు శ్రీమతి చన్నమంటమ్మ ఎం ఏ ఎల్ టి

సర్వతోముఖమైన స్త్రీజనాభ్యుదయమే తన ఆశయంగా తదాశయసిద్ధికోసం ఎనిమిదేళ్ళనుంచీ నిరంతర కృషి చేస్తూన్నది ఆంధ్రమహిళ

ఆంధ్రమహిళలో ఉత్తమ కథానికలతోబాటు సాంఘిక, రాజకీయ సారస్వత వైజ్ఞానిక మున్నగు వివిధ రంగాలకు సంబంధించిన వ్యాసాలు విశేషాలు ప్రచురింపబడుతవి

ఆంధ్రమహిళ ప్రతి జన్మదినసంచికా ఎక్కువ పేజీలతో మనోజ్ఞంగా అలంకరింపబడుతుంది

రచయితలు, అభిమానులు ఎప్పటికప్పుడు సహకరిస్తూండాలని కోరుతున్నాం

విడిప్రతి వెల 0-8-0 సం॥ చందా రూ 6-0-0

(చందాదారులకు ప్రత్యేకసంచిక ఉచితం)

ఇతర వివరాలకు, మేనేజర్ ఆంధ్రమహిళ,
14, ద్వారక, మైలాపూరు - మద్రాసు 4

# పుస్తక సమీక్ష

(రివ్యూకై రెండు ప్రతులు పంపాలి)

## ఖండకృతి

ఖండకావ్యముల సంపుటి కర్త శ్రీ జాస్తి వేంకటనరసయ్య క్రౌను 38 పుటలు వెల 0-8-0 ప్రతులకు గుంటూరు జిల్లా చిలకలూరిపేటలో నున్న గ్రంథకర్తగారికి వ్రాయవలెను

శ్రీ వేంకట నరసయ్యగారు కిపెంకిత కుటుంబమున జెంపిన పండిత కవులు గురుకులవాసము నొనరించి విద్య గడించిన విద్వాంసులు తమ కవితాశక్తిని ప్రదర్శించుచు నున్నది తొమ్మిది పుటల యీ చిన్న పుస్తకములో నున్నవి తొమ్మిది విషయములను వ్రాసి అందిక లనుగూర్చి ప్రకటించినారు దైవప్రార్థన మొదలు కొని ఆంధ్రప్రశస్తి ప్రశస్త్యములు రాజకీయ సాంఘిక-ఆర్థిక సారస్వతాది వివిధవిషయములు మనోహరముగను అత్యంత సంగ్రహముగను ఇందు వర్ణితములు

రచన చక్కగా నాగినది మచ్చునకు రెండు పద్యములు—

"ప్రవిమలమ్మగు జాతీయపథమునందు
మూఁడుకోట్ల తెనుంగులు ముందు నడచి
స్వీయరాష్ట్రమ్ము సాధించి సేవఁజేయఁ
దవరు వీరికు లాచంద్రతారకముగ"

కదఁగి స్వాతంత్ర్యరక్షణ క్రమమునందుఁ
జటులతరశిక్షణాభ్యాస పటిమచేత
సాటియోధులలోపల మేటివగుచుఁ
దేజరిల్లుము దేశమా! తెలుఁగుబిడ్డ"

"సత్యం శివం సుందరం"మ్మను పఠియుక్తి యెందు పెక్కుచోట్ల గ్రహింపఁబడినది. "భూమి కంపములు శార్దమిశ్రము విలాపింతురు పీటు రెండు (రెండవ పీటు) పీటు మూఁడు (మూఁడవ పీటు) పెపుస (పెప్పు)" మున్నగు ప్రయోగములు కానవచ్చుచున్నవి ఇయ్యవి ప్రయోగార్హములు కావని యనరాదు కాని శ్రుతి కవి కొంత వింతగ వినవచ్చును "జా"లు బదులు "ఝా" చాలాచోట్ల ముద్రణమున పడినది దానిని ద్వితీయ ముద్రణమున సవరింపనగును

రసవంతమైన యీ "ఖండకృతి"ని ధారాళి మాను లాదరించి యీ యువకవికి ప్రోత్సాహ మొసఁగుదురుగాక!

బు వేం ర

## భక్త గీతములు

రచన శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ బి ఏ (మూడవ ముద్రణము) ఫుల్‌స్కేప్ 21 పుటలు వెల మూడణాలు ప్రకాశకులు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు 292 సుభాస్ చంద్రబోస్ రోడ్డు మదరాసు 1

శ్రీ సత్యనారాయణగారు గీతికారచనలో పేరొందిన దేశభక్తులు; మృతజీవులు వారి జాతీయగీతములు సుప్రసిద్ధములు దేశభక్తిగీతములను రచించుటలోనే ఆయనకు మక్కువ ఎక్కువైనను ఆంధ్రజను లెల్లరును పఠించి, ప్రోత్సహించుటచే జనసామాన్యమున కుపయోగించునట్లుగా ఈ "భక్తగీతము"లను ప్రకటించిరి. ఇయ్యది స్వరూపమున చిన్న గ్రంథమే యైనను విషయమున గొప్పది ఈ యంశము—ఇది మూడు ముద్రణముల నందుటవల్లనే వ్యక్తపడుచున్నది ఇందలి గీతములు మనోహరములు

దీనిని రచించి ఆంధ్రలోకమున కర్పించిన శ్రీ సత్యనారాయణగారు ధన్యజీవులు దీనిని చక్కగ ముద్రించి ప్రకటించిన శ్రీ వావిళ్ళవారు ప్రశంసనీయులు

బు వేం ర

## పదహారు రాత్రులు

కథల సంపుటి క్రౌను 118 పుటలు త్రివర్ణ ముఖచిత్రము రచన శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు వెల 1-8-0 ప్రకాశకులు జయవికేతము మదరాసు-7

శ్రీ వేంకట రమణయ్యగారు బహుకృతి విఖ్యాతులు పండితులకు మాత్రం అర్థమయ్యే కృతులే కాకుండా సర్వజనాకర్షకంగా ఉండే కథలనుగూడ రచింపగల ప్రతిభాశాలురు

ఈ పదహారు రాత్రులు ఒకవ స్తుతివారివలె కథల పుస్తకము ఇందులో హేమప్రభుడనే రాజా మొదట స్త్రీవిముఖుడై యుంటాడు ఒక చిత్రకారు డతనికి స్త్రీవ్యామోహం కల్గించే చంద్రకళ చిత్రాన్ని చూపుతాడు దాన్తో అతని మనస్సు చంద్రకళపై పోయింది ఆమెను పొందటానికి ఆమె చెప్పలేని సమస్య ఇవ్వాలి. హేమప్రభుడు, అతని స్నేహితుడు దీనికి బయల్దేరివెళ్తారు ఆమెను జయించడానికి. దీనిది 16 రాత్రులు

కి న్నె ర

కథలు చెప్పి నమస్కరిస్తారు అమె వాట్ని అవ లీలగా చెప్పేసింది. 18 వ నాడు హేమప్రభుడు తన కథనే సమస్యగా ఇచ్చి చంద్రకళను జయిస్తాడు దీనిని చెప్పిన ఈ కథలు కేవలం కల్పనా ప్రధానాలుకాకుండా నీతిదాయకాలై యున్నాయి ఈ కథల్లో దార్వాహకుని కథ, అపూర్వమిత్రుల కథ, యమమన్మథుల కథ, కేవెలీగ కథ అతి మనోహరాలు పిన్నలకూ, పెద్దలకూకూడా హర్షాన్ని కల్గిస్తాయీ కథలు

అన్నింటికంటె ముఖ్యంగా ప్రతివారూ తెలుసుకోవలసిన విషయం ఒకటుంది పుస్తకంలో

అది ముఖదుఃఖరాశిభూతమైన ప్రేమంపటం పురుషుని కెట్లా కల్గింది అది ఎట్లా తప్పనిసరి అయింది అనే అద్భుత విషయం

పుస్తకం మొత్తంమీద ప్రతిపాదించే ఒక చక్కని నీతి ఇందులో ఉంది.

మన కా వస్తువుపై కోరికలేనన్నాళ్లు ఆ వస్తువు మన చేరికలో ఉంటుంది మనం కోరే టప్పటి కా వస్తువే దుర్లభమవుతుంది

ఈ పుస్తకం ముద్రణ, ముఖచిత్రములు చాల ఆకర్షణీయముగా నున్నవి

శ్రీ భాష్యం అప్పలాచార్యులు

## జ్యోతిషార్ణవనవనీతము

(ఆంధ్ర టీకాతాత్పర్యసహితము)

రచయిత : శ్రీ పింగళి వేంకటరామ జోస్యులు ప్రకాశకులు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్‌వారు వెల రు 3/-లు డెమ్మీ ఆక్టేవో సైజులో 214 పుటలు

మానవులలో ఆస్తికులు కొందరు, నాస్తికులు కొందరు నాస్తికుల మతములో ఇంద్రియోపలబ్ధము, అనుమానసిద్ధమునగు జగత్తే జగత్తు; అన్యము మిథ్య ఆస్తికుల కట్లుకాక, ఇంద్రియాతీతము అవాఙ్మనసగోచరమునగు పరతత్త్వమే పరమసత్యము ఐంద్రియిక జగత్తే మిథ్య అప్రతిష్ఠితమగు తర్కమూ సత్యమును సాధింపజాలదని సమ్యగ్దర్శనమునవే సత్యోపలబ్ధి యగునని వారి దృఢవిశ్వాసము జ్యోతిషాదులు ఆస్తికుల శాస్త్రములు మానవులకువలె గ్రహాలకుకూడ పక్షేకశీలాదులు గలవని, గ్రహగతుల ననుసరించి మానవజీవితముల పరిణామవిధము నిర్ణీతమగుచుండునని విశ్వసించువారికి జ్యోతిషము ప్రామాణికశాస్త్రము మానవకృతములైన గణనాదులందలి దోషములలో జ్యోతిశ్శాస్త్ర ఫలితములు కొన్ని తప్పినను ఆస్తికులైన భారతీయులకు శాస్త్రమందు ప్రామాణ్యబుద్ధి నేటికిని నిలచి యున్నది

"జ్యోతిషార్ణవ నవనీతము"లో ప్రధానముగ ఫలభాగము వివరింపబడినది జాతకచక్రములోని గ్రహాల బలాబలములను నిర్ణయించి తన్మూలముగా ద్వాదశభావముల విషయములను ఫలితముల నెట్లు చెప్పవలసినది సుబోధకములైన అనుష్టుప్ శ్లోకాలలో ఇందు ప్రతిపాదితమైనది కారికలను వ్రాసిన శ్రీ వేంకటరామ జోస్యులే ఆ కారికలకాంధ్ర టీకాతాత్పర్యములనుకూడ వ్రాసెను గ్రంథాదిని ద్వాదశరాశులు నవగ్రహాలు మొదలగు ప్రాథమికాంశములను కొన్నిటిని తెల్పి జాతకచక్రము వ్రాయుపద్ధతి నిరూపింపబడెను గ్రంథాంతమున గోచారఫలములను చెప్పి పిమ్మట అష్టవర్గఫలములు దశలు, రాహుకాది యోగములుకూడ వివరింపబడినవి

"దేవదేవ! మహాదేవ! త్రికాలజ్ఞ! మహేశ్వర!
జ్యోతిషార్ణవ పీయూషం సంక్షేపేణ వదస్వమే"

అని పార్వతీదేవి ఈశ్వరుని జ్యోతిశ్శాస్త్ర సారభూతమగు ఫలభాగమును వినిపింపుమని వేడగా అయన ఈ "జ్యోతిషార్ణవ నవనీతము"ను ప్రసాదించినట్లు కల్పనచేసి శ్రీ వేంకటరామ జోస్యులు ఈశ్వరప్రోక్తముగా ఈ శాస్త్రగ్రంథమును వెలయించెను

ఈ గ్రంథమునకు పీఠిక వ్రాసిన శ్రీ వేదము లక్ష్మీనారాయణ శాస్త్రిగారు ఈ గ్రంథకర్త్ర విరచితమైనా మహాగ్రంథావతారికనుండి కొన్ని పద్యాల నుదాహరించి తత్సాహాయ్యమున శ్రీ వేంకటరామ జోస్యులు గౌతమగోత్రికులని, మైసూరుమండలవాసియని, సింహాద్రి వేంకటరామ గురువియొద్ద జ్యోతిశ్శాస్త్ర మభ్యసించెనని పేర్కొనిరి గ్రంథకర్తృకాలము మాత్రము ఇదమిత్థముగా తెలియవచ్చుటలేదు

" ఇదివరలో భావార్థచంద్రిక యను నొక గ్రంథము ప్రత్యేకముగా భావలక్షణములను పేర్కొనుచున్నది యున్నను, సర్వార్థచింతామణ్యాదియుద్గ్రంథములలోని పేర్కొన్న విషయములను అనుభవమున గ్రోడీకరించి విపులీకరించు గ్రంథమిది యొక్కటియే యని చెప్పుట యతిశయోక్తి కాదు " అని పీఠికాకర్త నొక్కి ప్రకటించిన యభిప్రాయముతో నేకీభవింపనివా రుండరు జ్యోతిశాస్త్ర ప్రాథమికాభ్యాసకుల కీ గ్రంథ మత్యంతోపయోగి యనుట నిర్వివాదము

తెలుగు సాహిత్యములో శాస్త్రీయగ్రంథము లత్యంత విరళములు మన్నవి అట్టి శాస్త్రీయ రామాయణాదుల సమాల్యాభరణ మనదగిన యీ గ్రంథమును లిఖితప్రతులలో నిలుపుకానీయక ముద్రించి ఆంధ్రశాస్త్రీయ సాహిత్యమునకు వావిళ్లవారు చేసిన సేవ యనల్పమైనది

"శ్రీనివాస"

## ప్రపంచ చరిత్ర

రచన శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ అనువాదం శ్రీ చింతా దీక్షితులు ప్రచురణ కల్చరల్ బుక్సు లిమిటెడ్ 31, మిరాన్ సాహెబు వీధి మౌంటురోడ్డు, మద్రాసు 2 వెల ఒక్కొక్క భాగం రెండేసి రూపాయలు సైజు క్రౌన్ పుటలు మొదటిభాగం 216 రెండవభాగం 210

శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ విరచితమైన "గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ" ఇంగ్లీషులో ప్రసిద్ధమైన గ్రంథం నెహ్రూ జయిలులో ఉన్న పుడు ప్రపంచ చరిత్రమూ ముఖ్యఘటనలమూ వర్ణిస్తూ తన కూతురపేర వ్రాసిన ఉత్తరాలే "ప్రపంచ చరిత్ర" అనే పుస్తకరూపాన్ని పొందినాయి

నేడు ప్రపంచంలో జరుగుతున్న, ఇదివరలో జరిగిన ముఖ్యవిషయాలనుగూర్చి విశాలదృక్పథంతోనూ సునిశితదృష్టితోను సమీక్షింపబడినది యుద్ధాలూ రాజులూ రాజ్యాలు చేసిన కాలాలూ, వాని తేదీలను మాత్రం నేర్చుకోవడం చరిత్రయొక్క పరమావధికాదు సమాజాన్ని దేశాన్ని కలవరపెట్టి పురోగమిస్తున్న ప్రపంచ చరిత్ర తత్వాన్ని తెలిసికోవడంకూడా అవసరమే. అటువంటి దృష్టితోనే ఈ గ్రంథం రచింపబడినది బాలురకు సహితం అర్థంకాగలిగేటట్లు ఇంగ్లీషులో మూలగ్రంథం రచింపబడినది. అలాగే సరళంగాను సులభగ్రాహ్యంగాను ఉన్నది శ్రీ చింతా దీక్షితులుగారి అనువాదం కూడాను ఇంగ్లీషు భాషాపరిచయంలేని తెలుగు

వారు చదువుకోవటకు వీలుగా ఈ గ్రంథాన్ని తెలుగు ప్రజలకు అందజేసిన సంస్కృతి ప్రచురణవారు ఎంతయు అభినందనీయులు

యువకులు బాలబాలికలు, స్త్రీపురుషులు ఎల్లరు తప్పక చదువతగినది ఈ పుస్తకం

## "నా చిన్నప్పుడు"

రచన మోహన్‌దాస్ కరంచంద్ గాంధి అనువాదం శ్రీ బద్దెపూడి రాధాకృష్ణ మూర్తి బి ఎ బి ఎల్ ప్రచురణ కల్చరల్ బుక్స్ లిమిటెడ్ 31 మీరాన్ సాహెబు వీధి మౌంట్‌రోడ్డు మద్రాసు 2 సైజు: క్రౌన్ పుటలు 108 వెల రూపాయి

గాంధీమహాత్ముని ఆత్మచరిత్ర గుజరాతీ భాష నుంచి ఆంగ్లానువాదం క్లుప్తీకరించినారు శ్రీ మహదేవ దేశాయి దానిని శ్రీ బదిరెడ్డి రాధాకృష్ణ మూర్తిగారు ఆంధ్రీకరణం చేశారు

గాంధీమహాత్ముని జీవితచరిత్ర బాలబాలికలకు సులభంగా అర్థమయ్యేటట్లు రచింపబడింది ఈ గ్రంథం ప్రపంచ మహాపురుషులలో విఖ్యాతుడైన గాంధీజీ చరిత్ర ప్రతివారూ తెలిసికోవాలి అందులో భారతీయులందరూ తప్పక తెలిసికొని ఉండాలి క్లుప్తంగాను, తేలికగాను రచింపబడిన ఈ గ్రంథం విద్యార్థులు, యువకులు చదువుటకు ఎక్కువ ఉపయోగపడగలదు మహాత్ముని సంపూర్ణమైన ఆత్మచరిత్రము చదువుటకు అవకాశంలేని పెద్దలుకూడ దీనిని చదివినట్లయితే మహాత్ముని జీవితచరిత్రము క్లుప్తంగా తెలిసికొనుటకు అవకాశం కలుగుతుంది ముచ్చటయిన అచ్చులో ఆకర్షణీయంగా ఉన్నది

## గ్రంథస్వీకారం

1 మేఘసందేశము కాళిదాస కృతి కనుకృతి శ్రీ దామెర రాజగోపాలరావు చిత్రాడ వెల ఒక రూపాయి

2 అరుంధతీ వసిష్ఠము రచన శ్రీ బులుసు వేంకటేశ్వరులు బి ఏ విద్వాన్ ప్రకాశకులు: బి వి అండ్ సన్సు, రామారావుపేట, కాకినాడ వెల ఒక రూపాయి

3 మాతృత్వము శిశు సంరక్షణ గ్రంథకర్త్రి పార్వతి శ్రీనివాసన్ అనువాదకురాలు శ్రీ మో శ్రీ సీతాదేవి చెల్లం ప్రాప్తిస్థానం పార్వతి శ్రీనివాసన్ C/ డాక్టర్ టి సీతాపతి అయ్యర్ గోకులం ముండకణ్ణి అమ్మన్‌గుడి వీధి మైలాపూరు మద్రాసు వెల మూడు రూపాయలు

4 రశ్మి (గీతాసంపుటి) రచన శ్రీ పి వి రామనరసయ్య ప్రతులకు "నేత" కార్యాలయం నారాయణగూడ, హైదరాబాదు

5 వాసవీకన్యక (నాటకము) రచన శ్రీ దివ్వెల పిచ్చయ్యగుప్త "సాహిత్యరత్న" ప్రచురణ గ్రంథకర్త గౌరీశంకరపురం గుడివాడ, కృష్ణజిల్లా వెల ఒక రూపాయి

6 రాగరేఖలు రచన శ్రీ పిల్లలమర్రి హనుమంతరావు ఎం ఏ ప్రచురణ గ్రంథకర్త, శారదాపీఠము గుంటూరు వెల ఒక రూపాయి

7 మంచుతెరలు (నాటికలు) రచన శ్రీ రావులపర్తి భద్రిరాజు వెల పన్నెండు అణాలు

8 మైం గరీబ్ హూం ఉర్దూమూలం శ్రీ కవిరాజమూర్తి అనువాదం శ్రీ గిడుతూరి సత్యం ప్రచురణ ప్రజాసాహిత్య పరిషత్తు ఎ 70 80 కుద్బీగూడ హైదరాబాదు వెల ఒక రూపాయి

9 అమ్మా (నాటకం) రచన కారల్ చాపక్ అనువాదం శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు ప్రచురణ అరుణరేఖ పబ్లికేషన్స్ నెల్లూరు వెల ఒక రూపాయి

10 మానవహిత సందేశము ఆంగ్లకృతి శ్రీ బాలానందస్వామి వారు అనువాదం శ్రీ కొలన బాపనయ్య బి ఏ, బి ఎల్ ప్రచురణ దారిద్ర్య నివారణసేన, రాజమండ్రి వెల ఒక రూపాయి

11 ప్రజారాజ్యం (ప్లేట్ డ్రామా) రచయితలు ఉభయభాషాప్రవీణ శ్రీ జాస్తి వెంకటనరసయ్య, శ్రీ ధూళిపాళ వెంకటసుబ్రహ్మణ్యం ప్రకాశకులు దేశకవితామండలి ఘంటసాల, కృష్ణా జిల్లా వెల పది అణాలు

12 రాజ్యలక్ష్మి (ఖండ కావ్యము) రచన శ్రీ మానూరు కృష్ణారావు, నందివెలుగు, తెనాలి తాలూకా వెల ఎనిమిది అణాలు

13 భారతీసమితి (మాసమాన పంచిక) సంపాదకుడు శ్రీ కోగంటి దుర్గా మల్లికార్జునరావు ప్రచురణ విఘ్నేశ్వర గ్రంథమాల పామర్రు వెల నాలుగు అణాలు

14 చలో ఢిల్లీ (బుర్రకథ) రచయితలు శ్రీ జాస్తి వెంకటనరసయ్య శ్రీధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యము ప్రకాశకులు ది మోడరన్ పబ్లిషర్స్ తెనాలి వెల నాలుగు అణాలు

15 మీకు వివాహమైనదా? రచయిత శ్రీ బి విశ్వేశ్వరరావు ప్రచురణ బి వి జగన్నాథ్ అండ్ కంపెనీ, 17 కె ఎన్ టాంక్ వీధి మద్రాసు-1

16 New Deal for Tanjore Ryots

17 The Library Movement in Madras State

18 Government Transport

19 Women s Welfare in Madras State

20 చేపల పరిశ్రమ

పై అయిదు పుస్తకాలు ప్రచురణ ది డైరెక్టర్ ఆఫ్ ఇన్‌ఫర్మేషన్ అండ్ పబ్లిసిటీ మద్రాసు ప్రభుత్వం

Printed by V Azizullah at the Deccan Times Press 137, Broadway, Madras, for the Deccan Printing & Publishing Co Ltd., Madras. Published by P Mira Bai at 16, Jones Street, Madra. Editor: P MALLIKARJUNA RAO Assistant Editor: P MIRA BAI.

